# ఈ రాత్రి

# ప్రపంచాన్నంతా ఒక్కసారి మరచిపోండి!



రబ్బరుమేళవించిన కోయర్ అంగసౌష్టవానికి అనుగుణ్యంగా ఒరగడానికి ఆధారము.

రబ్బరు మేళవించిన కొబ్బరిపీచు
పరుపులు మీద చీకూచింతా మరిచిపోతారు.
వెన్నునొప్పులు ఉండవు
నవోదయానుభవంతో నిద్రలేస్తారు.

రబ్బరుమేళవించిన కొబ్బరినారు ఏ ఇతర
భోగవంతమైన పరుపులమీదపడుకున్నట్టే
సుఖదాయకంగా ఉంటుంది.

మరి వెల. ఒక కల.

## రబ్బరుమేళవించిన కోయర్

మాట్రెస్‌లు • మెత్తలు • దింబులు దిండ్లు

సులభంగా కొనవచ్చు సులభంగా విశ్రమించవచ్చు



కోయర్
బోర్డు
కొచ్చిన్ 682016

త్వరగా కోయర్‌కి అలవాటు పడండి దగ్గరి కోయర్ డీలర్ దగ్గరికివెళ్లి.
కోయర్ బోర్డు షోరూమ్ & సేల్స్ డిపో, బొంబాయి, న్యూఢిల్లీ, కలకత్తా,
మద్రాసు బెంగళూరు, కొచ్చిన్, మధురై, ఛండీఘర్, భువనేశ్వర్, పాట్నా,
హైదరాబాదు మరియు దేశమంతటా ఇతర అనుమతిపొందిన కోయర్ డీలర్లు.

SISTA'S CB 5/75 TEL

## ఉత్తరాలు

### సీరియల్

మమత ముఖచిత్రంతో వెలువడిన 13 2 76 పత్రిక ముఖచిత్రము అంత ఆకర్షణీయంగా లేదు. "మనుగడలో "మలుపులు సీరియల్ ఉత్సాహంగా ఉన్నది రెండవ సీరియల్ వెన్నెల కన్నెలు వారం,వారం ఆసక్తి పెంచేవిధంగా రచయితగారు వ్రాస్తున్నారు. సినిమాలో శ్రీనివాస్‌గారు, అక్కినేనిగారి అన్నపూర్ణా స్టూడియోనిగురించి ఫొటోలతో సహచూడ ముచ్చటగా తెలిపినారు.

పోగుల పాండురంగారావు, (వల్లభరావుపాలెం)

* * *

మమత ముఖచిత్రంలో విరాజిల్లిన 13.2.76 పత్రిక నిండుగా వుండి తెలుగుతన్నాన్నినిండుగా విరజిమ్మినది. వెన్నెల కన్నెలు ఆదిలోనే ఆకట్టుకుంటున్నారు. నలుగురు కన్నెల మనస్తత్వాలను ఈ సీరియల్ ద్వారాచదువుకోవచ్చు రచయిత్రికి కృతజ్ఞతలు

లతీఫొద్దీన్ అహమద్ (సుల్తానాబాద్)

### కథలు

'నిజం చెప్పకు' 'మనిషికథలు' బాగున్నాయి.'వెన్నెల కన్నెలు' అత్యంతతాసక్తిదాయకంగా ఉంటున్నది.

మందరపు రోశయ్య, (నిడుబ్రోలు)

## నూతలపాటి కవితా సత్కారం కవులకు విజ్ఞప్తి

స్వర్గీయ యువకవి శ్రీ నూతలపాటి గంగాధరం పేరిట ప్రతిసంవత్సరం మే 29 న రు1116 లతో జరిగే కవితా సత్కారం కోసం తమ రచనలు పంపుకోదలచినకవులు క్రిందిసూచనలు పాటించగోరడమైనది. (1) జనవరి 1-73 నుండిడిశంబరు 31-75వ తేదీలోగా ప్రచురింపబడిన కవితా గ్రంథములు మాత్రమే పంపవలయును (2) కవిత ప్రాచీనాధునిక కవితా రీతులలో ఏ కోవకు చెందినదయినను కావచ్చును. కానీ అది పలువురు కవుల కవితల సంకలనం కాకూడదు అనువాద గ్రంథాలు పరిశీలింపబడవు. (3) పరిశీలనార్థం ప్రతి పుస్తకం నాలుగు ప్రతులు పంపవలయును. (4) కవితా గ్రంథములు మార్చి 31-76 వ తేదీ లోపల పంపవలయును. (5) కవులు తమ గ్రంథములను కార్యదర్శి, గంగాధరం సాహితీ కుటుంబం (రిజిష్టర్డు) 3—4—58 గిరింపేట, చిత్తూరు—2—అన్న చిరునామాకు పంపగోరడమైనది.

ఇట్లు: మధురాంతకం రాజారాం, అధ్యక్షుడు, గంగాధరం సాహితీ కుటుంబం, చిత్తూరు.

*

# హ మే షా త మా షా

*











## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాదుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం 27–2–'76

రాక్షసనామ సం మాఘ బ త్రయోదశి

*సంపుటము 69 సంచిక 25*

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సరచందా – రు 33–80

ఆరుమాసాల చందా – రు. 16–90

విడి ప్రతి వెల 60 పైసలు

*ఆంధ్రపత్రిక కార్యాలయము*

గాంధీనగరం, విజయవాడ–520003


వి ష [illegible] క్ర మ ణి క



[illegible] టి జయ[illegible]ని

( ఫొట[illegible]ర్. డి. మూర్తి )

*కథలు :*



*ఫీరియల్ కథలు :*



*వ్యాసాలు, శీర్షికలు :*

# ప్రశ్నావళి

**కె. రామలక్ష్మి**

**పి. ఆర్ బోలరం**

ఓ చిత్రంలో 'అబద్ధాన్నయినా నమ్మవచ్చుగాని ఆడదాన్ని నమ్మలేం!' అని ఒక డైలాగు విన్నాను ఏ మహా రచయిత రాసిన దై వుంటుందావాక్యం!

కనీసం అబద్ధాన్ని నమ్మతాడు మా కర్మ మీ మగాళ్లు చెప్తే అది అబద్ధం అనీ, నిజం అనీ తెలియదే! యింక మిమ్మల్ని ఎలా నమ్మడం ? అంచేత అబద్ధం నమ్మి ఆడదాన్ని నమ్మకపోవడమే బాగుంది— నిజం చెప్పినా నమ్మకం కుదరని మగ వాడిని నమ్మేకంటే ఏమంటారు.

**ఎన్ విజయవాడ**

మీ అభిమాన సంఘం మా ఆంధ్ర లయోలా కాలేజీలో స్థాపిద్దామనుకుంటున్నాం. మీ అభిప్రాయం ?

ఎందుకొచ్చిన బెడద? నా దగ్గిర నల్లధనం లేదు యిచ్చి అభిమానసంఘం పెట్టించుకుని సన్మానాలు సత్కారాలు చేయించుకుంటూ 'ఓహో నేనింత గొప్పదాన్ని' అని మురిసి పోడానికి

**ఎమ్. వి. ఆర్ టాటానగరు**

మీరు మా ప్రశ్నలకి సూటిగా సమాధానం యిస్తారా? లేక ఎవరికేనా మామూలు గాని యిచ్చి చెప్పించుకుంటారా ?

బాగుంది మీ వరస ! అంబలి తాగే వాడికి మీసాలు పట్టుకుందుకని ఒక మనిషి! ఎవరేనా వింటే నవ్వుతారు.

**జి. వి. వి. ఎస్. ఎమ్ పిఠాపురం**

మీ శీర్షిక ఒక్కోసారి కవరు పేజీ మీద, మరో సారి సినిమా విశేషాల్లో, ఒక్కోసారి అడ్డంగా, ఇంకో సారి నిలువుగా వేస్తారు. కారణం పత్రికవారికి గెటప్ తెలియకనా ? లేక మీ మీద చులకన భావమా?

రెండూ కాదు ప్రశ్నావళి ఎక్కడ వేసినా చదువుతారన్న ధీమా! (ఎలా అన్నాను??)

**ఎ బి హెచ్ డి మోరి**

'శ్రీమతి' అనే మాట గౌరవపదమా? భర్త వుండగానే పిలిచేదా ?

శ్రీమతి అంటే 'మిసెస్'గా అంటే 'పెళ్లయిన' స్త్రీకి చిహ్నంగా వాడుతున్నారు. అవివాహిత స్త్రీని 'కుమారి' అన్నట్టు.

**ఎ. ఆర్. ఆగ్. బాపట్ల**

చిరకాలంగా పరిచయం వున్న మహిళామణులు కూడా 'ఆడది' అంటే సహించరెందుకు?

ఆడది అంటే చేతకానిది, అబల, ఆధారపడి బ్రతికేది అ వ్యూనతార్థం స్ఫురిస్తుంది. అందుకనే సహించ లేరు.

**కె టి ఎమ్ హైదరాబాదు**

మగవాడు రాక్షసుడు. వాడికి దయ, జాలి లేదు అని కథలు రాసే కొందరు రచయిత్రుల పై మీ అభిప్రాయం?

కథలే కద రాస్తూంట! నిజంగా అనడం లేదే?

**ఎస్. ఎమ్. ఆర్. కడప**

నేను మిమ్మల్ని చూడ లేదు గాని మీ మాటలు మీ జవాబులు వింటూంటే మీరు అచ్చం సినిమాలో సూర్యకాంతంలా వుంటారని అనుకుంటున్నాను.

కర్మ. నేను అవునన్నా సూర్యకాంతం కాదంటుంది. భాయీ. అందుకే ఒప్పుకుందుకు భయంగా వుంది. పాపం! సూరేకారం చాలా నెమ్మదస్తురాలు. నేనా? అడక్కు!

## రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్......

కోతిబొమ్మ వేయబోయి
తనబొమ్మవేసి చూపినవాడు
కళాకారుడు కాదు
విమానాన్నికాక తనని ప్రదర్శించుకొనే
చోదకుడు
గాలిలో ఎంతోసేపు నిలవలేడు !

**కె. యు. తెనాలి**

కె. రా. గారూ ఈ మధ్య మా వూళ్లో మహిళా మండలి వాళ్లు ఏర్పాటు చేసిన ప్రదర్శనలో చెక్క పకోడీలు, తపాల చెక్కలు," లవుజులు, బజ్జీలు చీరలమీద అల్లికలు యిత్యాదులు ప్రదర్శించారు. ఇదా ప్రస్తుతం మహిళలు చేయదగినది?

ఇంతకంటే ఏం చేస్తారు? యథా రాజా తథా ప్రజా కద! ప్రపంచ తెలుగు మహాసభలలో మహిళా విభాగం వారింతకంటే ఏం నిర్వాకం చేయలేదు చిట్టితల్లీ. వేదిక మీద మేం తలలు వంచేలా 'ముగ్గుల పుస్తకం'' ఆవిష్కరించారు! ఉపన్యాసాలు చాలానే చేస్తున్నారు. యీ సంవత్సరం అయిపోతోంది కదా యిక హమ్మయ్య! అని యీ గొడవ మరిచి పోతారు.

**పి. పి. ఆర్ గెద్దినాపల్లి**

కొడుకు తప్పు చేస్తే దండించే అధికారం తండ్రికి వుంది. కాని తండ్రి తప్పుచేస్తే ఆతడిని ప్రశ్నించే అధికారం కుమారుడికి లేదా?

ఉంటుంది అ తండ్రి మీద ఆర్థికంగా ఆధారపడి బ్రతకని కొడుక్కు

---

★ 1887లో ఫిలిప్ హెన్సన్ అనే అతను పదేళ్ళుగా అతను పెంచిన గడ్డం '6' అడుగుల, '8' అంగుళాలు వుందని తేల్చాడు. కాని గడ్డం పెంచటంలో ప్రపంచ రికార్డు స్థాపించింది నార్వేకు చెందిన హన్స్‌లాంగ్సెతే. ఆయన పెంచిన గడ్డం పొడుగు 17 1/2 అడుగులు. 55 సం ల పాటు క్రమం తప్పకుండా గడ్డం చేసుకున్న మనిషి తను గడ్డం గీసుకోటానికి పట్టిన మొత్తం టైము లెక్కవేసుకుంటేదాదాపు3350 గంటలు, (139 రోజులు) వచ్చింది. అందుకనే గడ్డం పెంచుతున్నాను అని అన్నాడాయన.

★ చక్రాల కుర్చీలో కూర్చున్న మనిషి

## నమ్మా - నమ్మకపో

చూపునుబట్టి ఆ కుర్చీ అటూ అటూ నడిచే పద్ధతి హేయస్ ఇంటర్నేషనల్ అమెరికావారు కనుగొన్నారు. సన్నటి కాంతికిరణాల్ని కుర్చీలో కూర్చున్న వ్యక్తి కళ్లల్లోకి రెండుఅద్దాలగుండాపంపుతారు. ఆ వ్యక్తి కళ్ళు అటూ, ఇటూ త్రిప్పటం వల్ల ప్రతిబింబించే కాంతియొక్క ఇన్‌టెన్సిటీని ఫొటో డిటెక్టర్ కనుగొని, ఎలక్ట్రికల్ సర్క్యూట్స్‌ను పని చేయించి చక్రాల కుర్చీని నడుపుతుంది. ఇదే పద్ధతివల్ల చేతులు ఉపయోగించకుండా పుస్తకాలలోని పేజీలు త్రిప్పటం వంటివి కూడా సాధ్యమవుతాయి.

★ డాక్టర్లులేని చిన్న చిన్న వూళ్ళలోని ప్రజలకు దగ్గరలో డాక్టరు లేడే అని బాధ పడవలసిన అవసరంలేదు ఇల్లినాయిస్ మెడికల్ సొసైటీ వారు సూచించిన ప్రకారం – ఒక పట్నంలో తన ఆఫీసులో కూర్చుని డాక్టరుగారు చుట్టుప్రక్కల వున్న పల్లెటూళ్లల్లోని రోగులను టెలివిజన్ ద్వారానె పరిక్షించి, ఏమి మందులు వాడాలో చెప్పటం – డాక్టర్ల తక్కువయ్యాగే అనే భావం రాకుండా చేస్తుంది కాని నిరుద్యోగు లయిన డాక్టర్లు పెరిగిపోతున్న మన దేశంలో, అటువంటిది ఆరోగ్యకరం కాదు కదా ?

సేకరణ : ''విమలా గౌతమ్''

## ప్రశ్నావళి

**జె. ఎల్. ఆర్. — విజయవాడ**

కట్నం పేరిట ఒక ఆడదానికి అమ్ముడు పోయే మగవాడు ఆమెకు బానిసలా ఎందు కుండడు?

బాగుంది చిట్టి తల్లీ నీ అనుమానం. 'కట్నం నేనా తీసుకుంట? మా అమ్మా నాన్నా తీసుకున్నారు అంచేత నీవు నా భార్యవి కనుక నేను నీ యజమానినే' అంటాడు గాని 'క్షమించు కట్నం తీసుకున్నా నిన్ను నేను నాతో సమానంగా చూస్తాను' అనడు.

**ఎస్. పి. ఆర్. — గుండవోలు**

మీ ముందు దేవుడే దిగివస్తే ఏం వరం కోరుకుంటారు?

ఒకటా రెండా? 'నేనేం కోరుకొంటే అది జరిగేలా చూడు బాబా' అని కోరకొంటాను.

# వెన్నెల కన్నెల

## డి.విద్యేశ్వరి

*[గత సంచిక తరువాయి]*

**జరిగినకథ 3:** ఎం.ఎ. చదువుతున్న కుముద, శశికళ, జ్యోత్స్న, చంద్రకాంతలు ప్రాణ స్నేహితులు. జ్యోత్స్న పెళ్లికి వచ్చిన మిగిలిన ముగ్గురూ కోపిష్టిలావున్న పెళ్లి కొడుకుని చూసి, భయస్తురాలైన జ్యోత్స్న అతనితో ఎలా సమాధాన పడుతుందా అని మథనపడ్తారు. చంద్ర కుముదతో పాటే రిసెర్చి చేస్తూ లెక్చరరుగా చేరగా శశి ప్రైమరీ స్కూల్లో చేరుతుంది. ఇద్దరు పిల్లల తల్లయినా జ్యోత్స్న కాపురం సరిగా లేదని గ్రహిస్తారు స్నేహితులు ముగ్గురూ. పెళ్లి చేసుకొని భర్తతో, బొంబాయి వెళ్లిపోయిన కుముదకి చంద్ర తనకంటె తక్కువ చదువుకున్న సూర్యనారాయణను పెళ్లిచేసుకోవాలనుకుంటోందని వుత్తరం రాస్తుంది శశి.

శశి ఉత్తరం కుముదలో ఆలోచనలు రేపింది. శశికి అన్నీ ఉన్నాయి ఏవి కావాలో కూడా తెలియనంత ముద్దుగా పెరిగింది. పెళ్ళంటే ఎందుకు ఉత్సాహంలేదో తెలియటం లేదు. ఒకవేళ జ్యోత్స్న సంసారం చూసి భయపడుతోందా? అందరూ అలా ఉండరని నచ్చచెప్పాలి. ఏమిటో ఎప్పుడూ మా పెళ్ళిళ్ళ గురించి, పెళ్ళయాక ఎలా ఉండాలో ఒక్క రోజుకూడా అనుకోలేదు. చంద్ర మొత్తానికి తనపంతం నెగ్గించుకుంది. కాస్త పరిస్థితులకి తలవొగ్గటంకూడా నేర్చుకోమని చెప్పాలి'' అనుకుంది.

చంద్ర పెళ్లి కూడా అయిపోయింది. కుముద నెలలువచ్చి నలుగురిలోకి రావడానికి సిగ్గుపడుతున్నా చంద్ర ఊరుకోలేదు. ''జ్యోత్స్న రానేలేదు మీరిద్దరైనా నాపక్క నుండవలసిందే'' అని పట్టుపట్టింది. ఇంక రాదనుకున్న జ్యోత్స్న సరిగ్గా పొద్దున్న పెళ్లి వేళకి ఊడిపడేటప్పటికి ముగ్గురూ సంతోషం పట్టలేకపోయారు సావకాశంగా చెప్పింది జ్యోత్స్న తనెలా వచ్చిందీ. పెళ్లికొడుకు వాళ్ల ఆడపడుచు వాళ్లతో ఉన్న స్నేహాన్నిబట్టి ఆ ఊళ్లోనే ఉన్న (వాళ్లని, పరిచయస్థులని) వీళ్లనికూడా పిలిచాడట. జ్యోత్స్న ఆడపడుచు పెళ్లికి వస్తూ ''పెళ్లికి వదిన్ని పంపవా, పెళ్లికూతురు,వదిన మంచి స్నేహితులు కదా'' అని అన్నగార్ని అడిగితే ''నీ ఫ్రెండు పెళ్లికి వెడతావని నన్ను అడగటానికి నామోషీయా'' అని నాలుగు కేకలేసి వెళ్లమన్నాడుట.

''అసలు పెళ్లి అని తెలియగానే చెప్పి నప్పుడు, శుభలేఖ చూపించినప్పుడు ఏం మాట్లాడకపోతే ఎలాగూ పంపననే అంటారు. అడిగి లేదనిపించుకోవడం ఎందుకని నేను అడగలేదు. మా ఆడపడుచు పుణ్యమా అని చంద్ర పెళ్లి చూశాను. రాలేనేమో అని నేనెంత బాధపడ్డానో తెలుసా? శశి ఇంక నువ్వే మిగిలావు'' అంది జ్యోత్స్న. అప్పటిదాకా జ్యోత్స్న వచ్చిందన్న పాలపొంగులాంటి సంతోషంమీద ఎవరో నీళ్లు జల్లినట్టయింది విన్న ఇద్దరికీ మాటంటే భయపడే జ్యోత్స్న మంచైనా, చెడైనా తిట్లు లేకుండా ఏపనీ జరగదా అని బాధ పడకుండా ఉండలేక పోయారు.

పెళ్లిహడావిడి, భోజనాలు అన్నీ అయాక తీరిగ్గా భర్తకి స్నేహితుల్ని పరిచయం చేసింది చంద్ర. జ్యోత్స్న చెప్పింది నిజమే. వినేవాళ్ళకి బైముండాలేగాని అతనికి మాట్లాడటానికి విసుగులేదు. జ్యోత్స్నని పరిచయం చెయ్యగానే ''మీరు మిసెస్ మురళీ కృష్ణగా మాకు తెలిసినా, మీ పరిచయం ఇప్పుడే కలిగింది'' అన్నాడు. ఆ మాటలూ ఈ మాటలూ అన్నీ అయ్యాక, మురళీకృష్ణ మీదకు మళ్లింది సంభాషణ.

''మురళీకృష్ణగారికి చాలాకోపంట కదా. పోస్టుగ్రాడ్యుయేట్స్‌నే కాకుండా, రీసెర్చి స్టూడెంట్లని కూడా కేకలేస్తారుట. ఆయన ఇంట్లో కూడా అలాగే కేకలేస్తారాండీ'' సూర్యనారాయణ అడిగేశాడు.

''కోపం తొందరగా వస్తుంది. అందుకని మేమే ఆయనకి కోపం రాకుండా సర్దుకుంటాం'' భర్తని సమర్ధించింది జ్యోత్స్న.

''మీకు తెలియదనుకుంటా, మా ఆఖరి తమ్ముడు మురళీకృష్ణగారి స్టూడెంటు. ఆ బ్లూషర్టు, అటు వెడుతున్నాడే వాడే. వాడెప్పుడూ చెప్తాడు పాఠం చెప్తే మురళీ కృష్ణగారే చెప్పాలని, ఆయన సబ్జెక్టుని క్లాసులో చర్చించి, లేటెస్టు సైంటిఫిక్ డెవలప్‌మెంట్సు కూడా చెప్తారని, ఆయనకి ఏ ప్రొఫెసర్లు కూడా సాటిరారని చెప్తాడు. అయితే క్లాసులోమాత్రం ఎవరూ కిక్కురుమన కూడదుట. ఎవరైనా కొంచెం అల్లరి చెయ్యడానికి చూస్తే కేకలేస్తారుట. అయినా ఎవరూ ఆయనకి ఎదురు చెప్పరు. పైగా వీళ్ళకి ఆయనంటే ఉన్న గౌరవం ఇంతా అంతాకాదు. ఒక నెలకిందట ఏమైందో మీకు చెప్పారా?''

''లేదు ఆయన కాలేజీ విషయాలు డిపార్టుమెంటు గొడవల్ని గురించి ఇంట్లో ఎక్కువగా మాట్లాడరు'' సంభాషణ తన భర్తని గురించే అవడం జ్యోత్స్నకి చాలా ఇబ్బందిగా ఉంది.

''బహుశ అంతపెద్ద విషయంగా ఆయన అనుకోలేదేమో. మురళీకృష్ణగారు ఎంత తిట్టినా ఎవరూ ఎదురు చెప్పరు కదా, ప్రొఫెసర్ని నేనెందుకు తిట్టకూడదనుకున్నాడో ఏమో, ఇంకొక ప్రొఫెసరు, ఎమ్. ఎస్. సి. ఫస్టియరు వాళ్ళ ఏదో గొడవచేస్తే ''బాస్టర్డ్స్''అన్నాడట. ఇంక చూసుకోండి. వీళ్లు రేగిపోయారు. అప్పుడు నేను విశాఖపట్నం వెడితే, వీళ్ళంతా స్ట్రైకులో ఉన్నారన్నారు. ఆ ప్రొఫెసరు క్షమాపణ చెప్పాలని అడిగారు. తప్పు ఆయనది, డిపార్టుమెంటు హెడ్డు కూడా మాట తూలడం మంచిది కాదన్నట్టుగా అన్నాడట. ఎవరూ తగ్గరు చివరికి డిపార్టుమెంటువాళ్లు, ప్రిన్సిపాలు కలిసి మురళీకృష్ణగార్ని స్టూడెంట్లదగ్గరకు రాయబారం పంపారు. ఈయన వాళ్లకి నచ్చచెప్పారట. అంతా అయినా ఒక కుర్రాడు ఇంకా ఏదో సణుగుతుంటే, ఈయన కోపం పట్టలేక అందర్నీ తిట్టి, స్ట్రైకు మాన్పించి, క్లాసులకి వచ్చేటట్టు చేశారుట. ''ప్రొఫెసరు తిట్టాడని స్ట్రైకుచేసిన మేం మురళీకృష్ణగారి తిట్లు తిన్నాకగాని క్లాసులోకి వెళ్ళలేదని మా తమ్ముడన్నాడు.'' సూర్య

నారాయణ చెప్పిన పద్ధతికి శ్రోతలు నవ్వకుండా ఉండలేకపోయారు.

"అంతేగాదండీ, అపుడు అల్లరిచేశారు బాగానేఉంది కాని పోస్టుగ్రాడ్యుయేట్స్ కదా, ఆ ప్రొఫెసరు పరీక్షల్లో ఏం చేస్తాడోనని భయపడిపోతున్నారు. మళ్లీ అందుకుకూడా మురళీకృష్ణగార్నే శరణన్నారు. "హెడ్‌తో మాట్లాడి పరీక్షల్లో అన్యాయం జరక్కుండా చూడమని" మురళీకృష్ణగారు మాట్లాడతానని అన్నారుట. పైకి కోపంవచ్చినా ఆయన చాలా మంచివారని వాళ్లందరికీ తెలుసు" అనేదో కొత్త విషయం చెప్తున్నట్టు జ్యోత్స్నతో చెప్పాడు.

## వెన్నెల కన్నెలు

ఇంతలో ఎవరో పెద్దవాళ్లువచ్చి పెళ్లి కొడుకు రావాలని లాక్కుపోయారు. "హనీమూన్‌కి వెడదామని" భర్త అన్నాడని చెప్పిన చంద్రని కాస్త ఏడిపించి, చాలా మంచివాడని అతనికో సర్టిఫికేటు, ఇన్నాళ్లలాగా నోటికి ఏమాట వస్తే ఆమాట అనెయ్యటం కాకుండా, కాస్త వెనకా ముందు ఆలోచించాలని చంద్రకి ఓ సలహాఇచ్చి ముగ్గురూ ఇళ్లకి బయలుదేరారు.

ఒక నెలలోగా కుముదకి, జ్యోత్స్నకి కూతుళ్లు పుట్టారు. ఈసారి ఇంటిని అన్నాళ్లు వదలడానికి వీలులేదని జ్యోత్స్న పుట్టింటికి పురిటికి రాలేదు. వాళ్ల అమ్మగారే విశాఖపట్నం వెళ్లారు.

"ఇంట్లో వాళ్లు మంచివాళ్లేనమ్మా, జ్యోత్స్నని ప్రేమగా, గౌరవంగా చూస్తారు. అతనే, ఏక్షణాన కోపం వస్తుందో చెప్పలేము. దీనికి రోజూ కత్తిమీద సామే. దినదిన గండం నూరేళ్లాయుపులాగా ఉంది. ఇన్నేళ్లలో ఎప్పుడూ వాళ్లింట్లో మేమెవరమూ ఇన్నాళ్లుండలేదు. పరిస్థితిని కళ్లతో చూడటం ఇదే మొదలు. ఇంకా నేనున్నానని అతను ఎక్కువగా ఇంట్లో కేకలెయ్యటంలేదని వాళ్లు అనుకుంటున్నారు. దీనిరాత ఇలా ఉంది"



జ్యోత్స్న క్షేమం కనుక్కుందామని, వాళ్లమ్మ గారు తిరిగివచ్చాక వాళ్లింటికి వెళ్లిన శశితో అన్నీచెప్పి ఆవిడబాధ తీర్చుకున్నారు.

అంతకుముందే పిల్లనెత్తుకుని అత్తవారింటికి వెళ్లిపోయిన కుముదకి విషయాలన్నీ రాసి తనమనసులో బరువు తగ్గించుకుంది శశి చంద్రకి రెండువాళ్ల మధ్య జీవితం, ఉద్యోగం ఇదివరకున్నంత తీరిక ఉండటం లేదు రోజులాఅమ్మాయికి కలలా గా, హాయిగా. స్వేచ్ఛగా దొర్లిపోతున్నాయి. మొత్తానికి మరో ఆర్నెల్లకి కుముదకూడా డాక్టరేట్ అనిపించుకుంది. ఆ సంవత్సరంలో కుముద, జోత్స్న తలోసారి వేరు వేరుగా పుట్టిళ్లకి వచ్చివెళ్లారు. "జ్యోత్స్న జీవితంలో రాటుదేలిపోతోంది. ఇదివరకులా అన్నిటికీ బాధపడుతున్నట్టుగా లేదు" అనుకుంది జ్యోత్స్నని చూసివచ్చాక శశి.

కుముద మాత్రం చాలా విశేషాలు చెప్పింది. పెద్దాడపడుచుకి పెళ్లి కుదిరిందని, చిన్నమ్మాయికి బి ఎ పూర్తిచేసే ఉద్దేశం లేనట్టుగా ఉందని, మరిదికి బెజవాడలో ఉద్యోగం దొరికి వెళ్లటంవల్ల, ఆడవాళ్లని ఆడుళ్లో ఉంచి, డబ్బు పంపడంకన్న, ఇల్లు అద్దెకిచ్చి అంతా బొంబాయిలో ఉందామని భర్త అన్నాడని చెప్పింది.

"అయితే పాపని చూడటానికి ఇంట్లో పెద్దవాళ్లుంటారు. నువ్వేదైనా ఉద్యోగం చెయ్యవచ్చు" శశి సలహా యిచ్చింది.

"అంత తేలికా శశీ, అసలు పెళ్లయాక వాళ్లతో అప్పుడప్పుడు వారం పదిరోజులు తప్ప నేను కలిసి ఉండలేదు. వాళ్ల బొంబాయి లైఫ్‌కి, మా పద్ధతులకి, నేను వాళ్లకి ఎడ్జస్ట్ అవాలికదా. ఉద్యోగం మాత్రం అంత తేలిగ్గా వస్తుందా ? అక్కడ యూనివర్సిటీ వాళ్లే ఉంటారుగదా. పైగా మాకు కంపెనీవాళ్లు ఇచ్చిన ఇల్లు ఊరికో మూల. నేను ఉద్యోగం చెయ్యాలంటే, కాలేజీ ఏపదిహేను, ఇరవైమైళ్లో దూరం అయితే కుదరదుకదా. ఎక్కువ దూరం కాకుండా వీలుగా ఏదైనా దొరికితే చేద్దామనే ఉంది. ఇంత చదువుకుని, ఆచదువుని కొన్నాళ్లైనా ఉపయోగించు కుంటే తృప్తిగా ఉంటుంది. సరదాకూడా తీరుతుంది" ఆశ నిరాశలమధ్య ఊగులాడుతూ ఉంది కుముద సమాధానం.

అన్నట్టుగానే ఆడపడుచు పెళ్లి కాగానే కుముద అత్తగారు వాళ్లంతా బొంబాయి వెళ్లిపోయారు. పెద్దత్తగారికి ఆరోగ్యం సరిగా ఉండదని, చిన్న ఆడపడుచుకి బొంబాయిలో ఉంటున్నందుకు చాలా ఫేషన్‌గా ఉండాలనే పిచ్చి అని, అయినా అన్నగారంటే చాలాభయమని, తను భయపడ్డ సమస్యలేవీ రాకుండానే అంతా స్థిరపడ్డారని రాసింది. చివర మాత్రం డబ్బు ఖర్చు విషయంలో ఇదివరకు కన్నా కొద్దిగా జాగ్రత్తగా ఉండాల్సి వస్తోందని రాసింది.

రోజులు గడిచిపోతున్నాయి. చంద్ర ఏ నెలకో శశిని కలిసి కబుర్లు చెప్పి వెడుతుంది. "ఉత్తరాల్లో కబుర్లు రాసే ఓపిక నాకుండదు నువ్వేమీడియేటరుగా మా కందరికీ విశేషాలన్నీ చెప్పు" అంటుంది శశితో. శశిమాత్రం తప్పకుండా కుముదకి ఉత్తరాలు రాస్తూ, జ్యోత్స్న సంగతులు వాళ్లింటినించి సేకరించి, అందరికీ ఇన్‌ఫర్మేషన్ ఇస్తుంది.

"రెండు నెలలు దాటింది శశిదగ్గర్నుంచి ఉత్తరంవచ్చి. ఏమై ఉంటుందా?" అని రకరకాల ఆలోచనల్లో కొట్టుకుపోతున్న కుముదకి శశి ఉత్తరం తెచ్చిన పోస్టుమేన్ దేవుడిలాగే కనపడ్డాడు. ఉత్తరం చేతిలోకి తీసుకున్న వ్యవధి లేకుండా కవరు చింపింది. శశి చాలా పెద్ద ఉత్తరమే రాసింది. "ఏం రాసిందో" అనుకుంటూ చదవటం మొదలు పెట్టింది.

"ప్రియమైన కుముదా,

ఇన్నాళ్లు నేనెందుకు ఉత్తరం రాయలేదా అని ఆశ్చర్యపోతున్నావా? చాలాపెద్ద కారణం ఉంది. అసలు నీకీ ఉత్తరం ఇలా కాకుండా వేరేగా రాస్తానేమో అని భయం వేసింది. ఇంకా దేవుడికి మా మీద దయ ఉంది, నేను నీకు మంచి వార్తలతోనే ఉత్తరం రాస్తున్నాను.

మా నాన్నగారికి రెండు నెలల్కితం మైల్డుగా హార్ట్ఎటాక్ వచ్చింది. వెంటనే రికవర్ అయినా పెద్దవయసు కావటంచేత మళ్లీ వస్తుందేమోనని చాలా భయపడ్డాము. దేవుడి దయవల్ల రాలేదు. రెండు నెలలు పూర్తిగా మంచంమీదినుంచి కదలకూడదన్నారు. జాగ్రత్తగానే చూసుకున్నాము ఇంక ఏం భయంలేదని, లేచి తిరగవచ్చునని అన్నారు నిన్ననే. అదృష్టవంతులం అనుకున్నాము. ఈ రెండు నెలలనుంచి ఎలా

ఉన్నామో, ఏం తింటున్నామో కూడా మాకు తెలియదు.

కుముదా! చాలా సార్లు నువ్వు చెప్పావు పెళ్లిచేసుకోమని. మీ ముగ్గురి పెళ్లిళ్లు అయ్యాక అమ్మ నాకుకూడా పెళ్లయితే బాగుండునని తరచుగా అనుకుంటుండగా విన్నాను. కాని ఎందుకో నాకే పెళ్లంటే ఏదో భయం. నేను పెరిగిన పరిస్థితులు అలాంటివి. నా ఆరోగ్యం అను, చిన్నదాన్ని అన్న గారాబం అను, ఇంట్లో ఎవరూ నేను అవునన్నది కాదనటంకాని, నన్ను నొప్పించటంకాని చెయ్యరు. నాకు "ఎవరైనా ఏమైనా అంటారేమో" అని అనుకున్నా భయమే. అంత సెన్సిటివ్‌గా తయారయ్యాను. అవసరమైనదల్లా అడక్కుండానే నా దగ్గరకు వచ్చేది. అందుకే నాకు ఎవరినీ ఏదీ అడగటం చేతకాదు. కాలేజీలో చేరాక, ఇంటికి రాగానే ఆకలేసి, అలసిపోయి మంచం మీద పడుకుంటే అమ్మో, వదినో చూసి ఏదైనా ఇచ్చేవారు గాని నాకై నేనెప్పుడూ అడిగేదాన్ని కాదు. అసలు మీ ముగ్గురితో స్నేహం కలిశాకే నాకు ప్రపంచం అంటే ఏమిటో తెలిసింది. అంతకుముందు నేను ఎవరిళ్లకీ వెళ్లేదాన్ని కాదు. అయినా వెళ్లడానికి నాకు స్నేహితులెవరున్నారు గనుక! బంధువుల ఇళ్లకి వెళ్లినా అమ్మవాళ్లతో వెళ్లటం తప్ప, నేను ఎవరింటిలోనూ రెండురోజులుండలేదు. నాకు ఇతరుల సంసారాలగురించి ఏమీ తెలియదు.

మీ పెళ్లిళ్లు అయ్యాక, ఇంకా ఎక్కువ విషయాలు తెలిశాక నాభయం పెరిగిందే కాని తరగలేదు. మా ఇంట్లోవాళ్లే నాక్కావలసినవి చేస్తారే, నేనెవరికో ఏం కావాలో ఎలా తెలుసుకోగలను? అన్నదే నా భయం. ఒకవేళ నేను వెళ్లిన ఇంట్లో పద్ధతులకి నేను అలవాటు కాలేకపోతే, అప్పుడు ఎంతమంది మనోవ్యధపడాలి? ఇదే నా ఆలోచన. అందుకే ఎవరైనా నా పెళ్లి మాటెత్తినా నేనెప్పుడూ పెదవి మెదపలేదు. కాని ఇప్పుడు తప్పలేదు. ఒక పదిరోజుల క్రితం నాన్నగారు నన్ను దగ్గరకు పిలిచి "చిన్నతల్లీ నా దగ్గర కూర్చోమ్మా" అన్నారు. ఎప్పుడైనా నాకు కోపం వచ్చిందనుకుంటేనో, తను చెప్పిందేదైనా నాచేత ఒప్పించి చేయించాలనుకుంటేనో నాన్నగారు నన్ను "చిన్నతల్లీ" అని పిలుస్తుంటారు. అలా పిలిచి ఏదైనా చెప్తే నేను కాదనలేను. మొన్నకూడా అలాగే పిలిచి "తన పిల్లలందరు సెటిలయ్యారని, నన్నుకూడా ఒక మంచి స్థితిలో పెట్టేస్తే ఇంకే బెంగా ఉండదనీ" ఏవేవో చెప్పారు. ఈ జబ్బుచేశాక నా గురించి ఆలోచిస్తున్నట్టు నాకర్థమైంది. నా మనసులో ఏముందో చెప్తే చేస్తాననీ, నన్ను నొప్పించడం తనకెప్పుడూ ఇష్టంలేదని అన్నారు. నా మనసులో ఏముందని చెప్పను — నా మొహం. "నీకు పెళ్లి చేద్దామని ఉందమ్మా" అని నాన్నగారంటే ఏం చెప్పలేక 'మీ ఇష్టం'అన్నాను. నాన్నగారు నాకోసం అంత బాధపడుతున్నారంటే ఆలోచిస్తున్నారంటే నాకు చాలా కష్టంగా ఉంది. ఎల్లకాలం అన్నయ్యల, వదినల మీద ఆధారపడి బ్రతకటం నాకిష్టం లేదు.

వాళ్లిష్టమే నా యిష్టం అనుకున్నారు. రెండు నెలల తరువాత, నాలుగురోజుల్క్రితం మళ్లీ స్కూలుకు వెళ్లాను. ఆరోజు సాయంత్రం నన్ను ఇంటికి తీసుకునిరావడానికి పెద్దన్నయ్య కారులో ఇంకెవరితోనో కలిసి వచ్చాడు. డాక్టరు రామకృష్ణ ఎమ్. ఎస్. ఫారిన్ రిటర్న్డ్ అని పరిచయం చేశాడు. ఇంటికి వచ్చి, కాసేపుండి అతను వెళ్లిపోయాడు. అప్పుడు చెప్పారు నాకు. అతనికి నన్ను చూపించాలని తీసుకునివచ్చారట. అతనీ ఊళ్లోనే సర్జన్. తండ్రి లేరు. ఇద్దరక్కలు చెరోచోట విదేశాల్లో సెటిలయిపోయారుట. ఒక అన్నగారుండేవారని, ఆయన భార్యకూడా సంవత్సరం క్రితం కారు ఏక్సిడెంటులో పోయారని చెప్పారు. వాళ్లకి ఇద్దరు పిల్లలున్నారుట. ప్రస్తుతం తల్లి, తను ఉంటున్నారట ఇక్కడ: వాళ్లందరూ మా మావయ్యగారికి మంచి స్నేహితులని, చాలా మంచివాళ్లని. నాకు అభ్యంతరం లేకపోతే మాట్లాడుతానని నాన్నగారు అన్నారు. ఏం చెప్పాలి ? మళ్లీ మీ ఇష్టం అన్నాను ఇంకేమనాలో తెలియక.

అయితే నిన్న ఒక తమాషా జరిగింది. పెద్దన్నయ్య మాట్లాడటానికి వెడితే, అతనే నన్ను రెండు ప్రశ్నలు అడగాలని మళ్లీ వచ్చాడు.

మొదటిది "ప్రస్తుతం వాళ్ల తాతగారింట్లో ఉన్న అన్నగారి పిల్లల్ని అతనే తెచ్చుకుని పెంచాలని అనుకుంటున్నాడట అందుకు నా కిష్టం 'ఉంటుందా" అని. రెండోది "పెళ్లి ఎంత సింపుల్‌గా జరిగితే తనకంత ఇష్టం అని అందుకు నాకేమయినా అభ్యంతరమా" అని, అడిగాడు.

చిన్నపిల్లల్లో పనిచేస్తున్నదాన్ని, పిల్లలంటే నాకిష్టమేనని, రెండోది—అసలు నా ఐడియా అదేనని చెప్పాను. పెళ్లి ఆడంబరంగా ఎందుకు చేసుకోవాలి ? నేనేం చిన్నపిల్లని కాదు గదా. అదీకాకుండా నాన్నగారు లేచి తిరిగి అన్నీ చూసుకోలేరు. అంతా అన్నయ్యలమీద పడుతుంది. ఎందుకొచ్చినగొడవ ? అమ్మకి మాత్రం ఆఖరిపిల్ల పెళ్లి ఇలా ఏదో అయిందనిపించడం ఇష్టం లేదు. కాని ఏం చెయ్యలేక ఊరుకుంది.

కట్నం విషయం వీళ్లేదో అడగబోతే "నాకు ఉద్యోగం తప్ప ఆస్తి ఏమీ లేదు. మీ అమ్మాయికి ఏలోటూ చెయ్యను. నాకు కట్నం అక్కరలేదు, మీ అమ్మాయికి మీరేం పెట్టుకున్నా మీ ఇష్టం" అని నిర్మొహమాటంగా చెప్పాడట. అది నాకు చాలా నచ్చింది. ఇంకా ముహూర్తం పెట్టుకోలేదు. పెట్టగానే మళ్లీ రాస్తాను. జ్యోత్స్నకికూడా ఇప్పుడే ఉత్తరం రాస్తున్నాను.

చంద్ర పొద్దున్న వచ్చింది ఇవాళ సెలవని. తనతో చెప్పాను. చాలా సంతోషంగా కంగ్రాచ్యులేషన్స్ చెప్పింది, కాని ఎందుకో నాలుగైదుసార్లు "ఉన్నఊళ్లోనే భర్తని వెతుక్కున్నావు హాయిగా" అంది. ఎప్పుడూ ఉన్నంత సరదాగా లేదు. ఏదో ఆలోచిస్తున్నట్టుంది. తనకిగా తను చెప్పాలిగాని, మనం అడిగితే ఏదీ చెప్పదు కనుక నేనేమీ అడగలేదు. ఈ ఉత్తరం చూసి నువ్వే మనుకుంటున్నావో, నా నిర్ణయం సరైనదో కాదో రాయి. నువ్వు చెప్తే నాకు ధైర్యంగా ఉంటుంది.

పాప ఎలావుంది? మీవారికి నా నమస్కారాలనిచెప్పు. మీ ఇంట్లో అంతా బావున్నారా. పాపకి నాముద్దులు.

నీ

శశి.

ఉత్తరం పూర్తిచేసి "పిచ్చిశశి" అనుకుంది కుముద. "ఈ ఆలోచనలు ఎవరికీ తప్పవు, నువ్వు మరీ సెన్సిటివ్ కనుక ఇంకా సీరియస్‌గా తీసుకుంటున్నావు. మనం పెద్దవాళ్లం, కష్టసుఖాలు తెలుసు గనుక పెళ్లంటే వేడుకకాదనీ, బాధ్యత అనీ తెలుసు. అదే ఇంత ఆలోచించలేని వాళ్లు పెళ్లంటే ఏమిటో తెలియకుండా భయపడతారు. అన్నీ సద్దుకున్నాక ఈ భయాలు సిల్లీగా అనిపిస్తాయి నువ్వు ఎక్కువగా ఆలోచించకు" అని ధైర్యంచెపుతూ శశికి ఉత్తరం రాసింది.

శశి పెళ్లిరోజు వచ్చింది. ఆకాశమంత పందిరీ భూదేవంత అరుగూ ఏమీ లేకుండానే పెళ్లయింది. దగ్గరబంధువులు, ముఖ్యమైన స్నేహితుల్ని భోజనాలకి పిలిచి, ఇంకా కొందరికి సాయంత్రం చిన్నపార్టీ ఇచ్చారు. ప్రతిసారిలాగే జ్యోత్స్న వస్తుందా రాదా అని సందేహించారు కాని ఒకరోజుముందే వచ్చింది. భర్త, పనిమీద హైద్రాబాదు వెళ్లాలని బయలుదేరుతుంటే భయంగానే అడిగిందిట, "మా స్నేహితురాలి పెళ్లి. నన్నుకూడా తీసుకువెడతారా" అని, చంద్ర పెళ్లి గుర్తుపెట్టుకుని.

ఏ కళనున్నాడో "నాలుగురోజులకి నాతో తిరిగివచ్చేసేటట్టయితే బయలుదేరమ"న్నాడట. పెద్ద పిల్లని అత్తగారి దగ్గర వదిలేసి వచ్చింది. "విశేషం ఏమీలేదా" అని అడిగింది చంద్ర.

"అంత అదృష్టం కూడానా నాలుగో నెల. ఈసారి గండం గడిస్తే నా పిల్లల అదృష్టం, డాక్టరు ఖచ్చితంగా చెప్పింది. మా వారికి కొంచెం భయంగానే ఉంది నేను పోతే పిల్లల్ని ఎవరు పెంచుతారా అని. ఈసారి పురిటికి ఇక్కడికేవచ్చి, నా యిష్టం వచ్చినట్టు చెయ్యమన్నారు. నా యిష్టందాకా వదిలారంటే ఇదేదో ... ఇంకా చెప్పబోతున్న జ్యోత్స్నకి కుముద "ఛీ! నోరుముయ్యి అపశకునం మాటలు" అని అడ్డుపడిందే కాని, ఆ ధోరణికి చాలా బాధపడింది. "ఎలాంటి జ్యోత్స్న ఎలా అయిందని" అనుకున్నారు చంద్ర, కుముద.

(ఇంకా వుంది)



## కాపీలో కొత్త పంథా!

వెస్ట్ బెర్లినులో వో న్యాయశాస్త్ర విద్యార్థి పరీక్ష హాలులో ట్రాన్సిస్టరు తక్కువ వాల్యూమ్ (స్థాయి)లో పెట్టుకునివింటూ పరీక్ష పేపరు చకచకరాసుకు పోతున్నాడట. ఆ కుర్రవాని ధ్యావధానానికి ముగ్ధులైన పరీక్ష హాల్లోని అధికారులు ఆతన్ని అభినందించబోయి, అక్కడే వుండిపోయారట. ఆవిద్యార్థి ట్రాన్సిస్టరువంటి మైక్రో ఫోను, రిసీవరున్న ఆ సెట్టుతో వో లాయరుగారితో సంప్రదించి, పరీక్ష ప్రశ్నాపత్రాలలోని అంశాలను



వివరించి, సమాధానాలు ఆ సాధనంద్వారావింటూ రాసేస్తున్నాడట. వోరి పిడుగా!

## వేగంగా నడిచే బూట్లు!

మనిషి జామ్మని గంటకు పదిహేనుమైళ్ల వేగంతో నేలమీద నడచిపోవడానికి వీలయ్యేబూట్లను రష్యా కనుగొన్నదట. ఈ బూట్లు పెట్రోలుతో నడిచేవోరకమైన బుల్లి ఇంజనుల సహాయంతో పనిచేస్తాయట. మడమలవద్ద ఏర్పడే ఒత్తిడికే యీ ఇంజనులు పని చేస్తాయట. గంటసేపునడిస్తే వోడెబ్భయ్యైదుగ్రాముల పెట్రోలు మాత్రమే ఖర్చవుతుందట. అంతా బాగుంది కానీ ఇప్పటికే పెట్రోలు సమస్య ఎదిక్కూర్చుంటే భూమండలంమీది జనులు ఆడామగా, పిల్లా పెద్దా, బీదా బిక్కి అనే తేడా లేకుండా యీ బూట్లేసుకోదల్చుకుంటే! రోజుకు తిరిగే గంటలూ ఇంటూ డెబ్బయైదు గ్రాముల పెట్రోలు ఇంటూ ప్రపంచ జనాభా యీజీక్వలూ హమ్మచ్చ!

## కుక్కల బెడద-కుటుంబ నియంత్రణ!

కుక్కల బెడద దేశంలో ఎక్కువైపోయింది. తమిళనాడులో యీకుక్కల సంఖ్య మితిమీరి ఆ కుక్కకాటుకు చావులు కూడా సంభవించాయట. ఈ సందర్భంలో దేశ ప్రభుత్వాలు కుక్కలనుచంపుతూంటే జంతు సంక్షేమసంస్థ అధ్యక్షురాలు రుక్మిణి అరండేల్ తన బాధను వ్యక్తంచేస్తూ "ఇలా కుక్కలను దారుణంగా చంపకపోతే ఎంచక్కా కుటుంబ నియంత్రణ ఆపరేషను ట్యూబెక్టమీ చేస్తే పోదా, ఆడ కుక్కలను పట్టుకుని" అన్నారట. మగకుక్కలకు వేసిక్టమీ చేసినా అంతే కదా! బేష్.

## పేషంటులున్నారు కాని...

వెంకటగిరి ప్రభుత్వఆసుపత్రిలోనూ ఘోషాసుపత్రిలోనూ గత నెల రోజులుగా ఒక్కఆడ డాక్టరయినా లేరట. తత్కారణంగా స్త్రీరోగులు చాలా బాధపడుతున్నారట ఇటీజ్ నాచురల్!

## తెనుగు సినిమా పాటను మించిన...

"లవ్ టూ లవ్యూ బేబీ" అనే వో ఇంగ్లీషు పాట చాలా అసభ్యంగా సెక్సుతో కంపరంగా ఉందని, పాటలో వచ్చే నిట్టూర్పులూ, మూలుగులు, తదితర తత్సంబంధమైన శబ్దాలూ అవీ కూడా చాలా సెక్సీగా ఉన్నాయనీ ఆలోచించి బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ (బి.బి. సి.) ఆ పాటను నిషేధించారట. అప్పటికే అది అమెరికాలోనూ యూరప్‌లోనూ శనగపప్పులా అమ్ముడుపోయి బ్రిటిష్ అమ్మకం రికార్డులో పదహారో

స్థానం ఎక్కి కూర్చుందట. ఈ పాట పాడి నది డోనాసమ్మర్స్ట హయ్యో! ఏ సినిమా కయినా ఆ పాటననువాదించుగాక!

**సారా వ్యాపారి యింటిపై 34 గురి దాడి**

...మ గోదావరి శ్రీపర్రు గ్రామంలో ముప్పై నలుగురు వ్యక్తులు మారణాయుధాలతో మంగల కొండలరావు అనే సారా వ్యాపారిని చంపడానికి దారికాచారట. ఏలూరునుంచి స్వగ్రామానికి తిరిగి వస్తున్న కొండలరావుకి యీ వార్త తెలిసి, అడ్డదారిన ఇల్లుచేరిలోపల దాక్కుంటే వారంతా ఆయన ఇంటిమీదపడి, తలుపులు విరిచి ఆయన్ని బయటకు యీడ్చి చంపివేశారట. అడ్డు వెళ్ళిన ఆయన భార్యకు, మరో ముగ్గురికి యీ చర్యలో తీవ్రంగా గాయాలు తగిలాయట. ●

## మహాయోగుల అనుగ్రహం ••• ధర్మపథం

లోకం లోని జనులు సంసారంలో పడి నానాఅవస్థలూ పడుతూ నెమ్మది లేకుండా ఉంటూ ఉన్నపుడు వాళ్లను తరింప జేయటానికి యోగులు సదుపదేశం చేస్తూ ఉంటారు. తరచు వారు చేసేవి వైరాగ్య బోధలే. నిస్పృహులైన ఆ మహనీయులు భిక్షాటనతో దేహధారణ చేసుకుంటున్నా జనసామాన్యం కష్టాలను పోగొట్టి వారిని అనుగ్రహించటమున్నూ కలదు.

భగవదవతారమూర్తిగా భావింపబడుతున్న ఆదిశంకరులు భిక్షార్థమై ఒక యింటికి వెళ్లారు. అది నిరుపేదల నివాసం. భగవత్పాదులు తమ యింటికి రాగానే ఆ యింటి ఇల్లాలు మనస్సులో చాలా బాధపడింది. భిక్షం పెట్టడానికి ఇంటిలో ఏమీ లేదు. ఒక ఉసిరికాయ ఉంటే దాన్నే వణుకుతున్న చేతులతో ఇచ్చి "స్వామీ మేం గర్భదరిద్రులం. మీరు వచ్చిన యీ సమయానికి మా గృహం సర్వశూన్యంగా ఉన్నది. వెతగ్గా వెతగ్గా ఈ ఒక్క ఉసిరికాయ మాత్రం దొరికింది. దీనిని స్వీకరించాలని ప్రార్థన" అంటూ ఆయన చేతిలో ఉంచినది.

ఆమె దయనీయస్థితిని చూడగా భగవత్పాదులకు చాలా పరితాపం కలిగింది. ఆయన వెంటనే లక్ష్మీదేవిని స్తుతిస్తూ కొన్ని శ్లోకాలు చెప్పారు. వాటిలో ఈ శ్లోకం ఒకటి:

'దద్యాద్దయానుపవనోద్రవిణాం
బుధారాం
అస్మిన్నకించన విహంగశిశౌ విషణ్ణే,
దుష్కర్మఘర్మ మపనీయ చిరాయ
దూరం
నారాయణప్రణయినీ నయనాం
బువాహః'

ఈ దరిద్రురాలనే పక్షిపిల్ల లేమి కారణంగా మిక్కిలి విషాదంతో ఉన్నది. లక్ష్మీదేవి కటాక్షమనే మేఘం, దయ అనే అనుకూల మారుతం ప్రేరించగా, పాపకర్మ అనే తాపాన్ని పోగొట్టి ధనమనే వర్షధారను కురియును గాక — అని దీని భావం. ఈ ప్రార్థనను వినగానే లక్ష్మీదేవి అనుగ్రహించి ఆ యింట కనకవర్షాన్ని కురిపించినదట! అందువల్లనే ఆదిశంకరుల ఈ లక్ష్మీస్తుతికి కనకధారా స్తోత్రం అనే పేరు రూఢమయింది.

మహాయోగులు తమకోసం దేనినీ కోరరు. దేనిని కోరినా ఆర్తజనరక్షణకూ, లోకహితానికీ మాత్రమే. భగవత్పాదులు ఈ స్తోత్రంలో తరచు తన్ను అనుగ్రహించాలనే దేవిని ప్రార్థిస్తారు. ఆ దరిద్ర గృహిణి లేమిని పోగొట్టడమే తన్ను అనుగ్రహించడమని వారి ప్రార్థన.

మహాయోగులు నిస్సంగులయినా ఆయా సందర్భాలలో సామాన్య ప్రజలను అనుగ్రహించి, వారిని ఉద్ధరించడం కానవస్తున్నది. ఇప్పటి కాలంలో కూడా శ్రీ రామకృష్ణ పరమహంస స్వామి వివేకానందులు నరేంద్రుడుగా ఉన్నప్పుడు దయనీయ స్థితిలో ఉన్న తమ కుటుంబాన్ని అనుగ్రహించి కాపాడవలెనని ప్రార్థించినప్పుడు ఈ విధంగానే ఆ కుటుంబానికి ఏ లోటూ కలుగకుండా చేసినట్లు తెలుస్తూ ఉన్నది.

—బులుసు వేంకటరమణయ్య

## సామాన్యుని సణుగుడు

### రెండు దృశ్యాలు

తెనాలినుంచి గుంటూరుకి బస్‌లో ఒక ఆదివారం ప్రయాణ చేస్తున్నాను... ఈ పాడు ప్రపంచాన్ని చూస్తూ దుఃఖపడే వోపికవున్న వాడెవడికైనా — కావల్సినంత దుఃఖం తెప్పించగల కొన్ని తెనుగు బస్‌స్టాండుల్లో తెనాలి బస్‌డిపో కూడా ఒకటి. ఆబస్ ప్యాసింజెర్‌బస్. అందులోకి ఓ రిద్దరు 'డోసు'మీదున్న ప్యాసింజెర్‌లు కూడా ఎక్కారు ... అందులో ముందు సీటుకి దగ్గరగా, స్త్రీల జాగాకి ఎడంగా కూర్చున్న "సారాభాయ్" ఫుల్‌లోడ్ మీద వున్నాడు ... బస్ అంతా గుప్ గుప్ మంటోంది వాసన — తనమట్టుక్కి తను మాత్రం చేతులనిండా సన్నజాజుల దండలు తగిలించుకుని, ఉమర్‌ఖయ్యాం వారసుడిలా మధ్య మధ్య వాటి ఘుమ ఘుమలు ఆఘ్రాణిస్తున్నాడు కాకపోతే మనవాడి నోటంట వెలువడుతున్న జానపదజాలమంతా హరీ హరీ అని చాదస్తులు చెవులు మూసుకోదగ్గదే ... కాని చెవులు ముక్కు కూడా మూసుకుని ఎంతకని కూర్చోగలం అని ఒక ధైర్యశాలి అతణ్ణి మందలించబోయాడు. మరో పిరికివాడు కండక్టర్‌గారూ అతన్ని దింపించండి అన్నాడు. "మందు భాయి" దాంతో మండు గుండుకు నిప్పంటుకున్నట్లు చెలరేగాడు ... ఆడవాళ్లంతా కళ్లు కూడా మూసుకున్నారు. దింపేశారు ఎట్టకేలకు ఆ శాల్తీని ... అతనికి చదువురాదు...సంస్కారంలేదు... వొంటిమీద తెలివిలేదు ... తంతే నొప్పి కూడా తెలియదు.' అయిపోయింది కాని కొంతదూరం పోయాకా కొంతమంది విద్యార్థులు పరిగెడుతున్న బస్‌ను ఆపారు. అయితే వాళ్లు విద్యార్థులేనన్న సంగతి కండక్టరు డ్రైవర్‌తో "స్టూడెంట్‌లు పదిమంది వున్నారు కాస్తాపులే" అన్నాడు కనుకనే తెలిసింది...బస్సు నిండిపోయింది. కాని వాళ్లు ఒకర్ని ఒకరు త్రోసుకుంటూ ఎక్కేసారు...అందులో అందరి చేతుల్లోను సిగరెట్‌లు ఘుమ్మని కాలుతున్నాయి.' అవి పారేస్తే పరువు పోతుంది కనుక వాటిని పారేయకుండానే ఎక్కారు వాళ్లు. ఇక వాళ్లు వేసే కేకలు కనపడ్డ ప్రతీ పదార్థం మీదా, ద్వంద్వార్థాలతో విసిరే విసుర్లు యివన్నీకూడా మొదట అల్లరిచేసి బస్‌లో నుంచి దింపివేయబడ్డ త్రాగుబోతు కన్నా నీట్‌గా ఏ మాత్రం లేవు. కాకపోతే మైనస్ నాటుసారా కంపు అంతే ... "రైట్ రైట్""హూల్డాన్‌హూల్డాన్" అంటూ ఒకటే కేకలు. అశ్లీల పదభూయిష్ఠమైన ఊతపదాలతో జోకులు కట్‌చేసుకుని విరగబడి, పగలబడి-నవ్వడం హోహో!—ఇవన్నీ వాళ్లకి విద్యాగంధం వల్ల పోవలసిన జాడ్యాలే. కాని పోకుండానే అలాగే వాళ్లంటున్నారు. చదువులు డిగ్రీలు సర్టిఫికేట్‌లు వాళ్ల కందుతున్నాయి ... శ్మశాన వైరాగ్యం లాగ ఆ కాస్సేపు యీ దేశం మీద యీ జన్మ మీద విరక్తి కలిగింది. దిగిపోయాను.

కాని కొంచెం రోజుల క్రితం ఒక

(46వ పేజీ చూడండి)

# వారఫలం

మహేష్

27-2-1976 శుక్రవారంమొదలు
4-3-1976 గురువారం వరకు

మేషం:— అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకించగలరు. స్త్రీలకు—పుణ్య కార్యాలు చేస్తారు. బంధువులకు చికాకులు ఏర్పడతాయి.

వృషభం:— రావలసిన డబ్బు అందుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

మిధునం:— శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మీ కంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసివస్తుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

కర్కాటకం:— మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. ప్రయాణాల్లో ప్రయాసకు గురికాగలరు. వారం ఆఖరులో నూతన వ్యవహారాలు లాభిస్తాయి అనుకూలమైన వార్తలను వింటారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

సింహం :— వృత్తిలో సాటివారిపోటీ పెరుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం ఆఖరులో, చికాకులు ఏర్పడతాయి. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

కన్య :— మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాటివారితోమాట పట్టింపులు తగవు. ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవంలభిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యంబాగుంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

తుల:— ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. స్త్రీలకు—పుణ్యకార్యాలుచేస్తారు. విలాస వస్తువులు కొంటారు.

వృశ్చికం:— అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు సాటివారిల్లో గౌరవం లభించగలదు. నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

ధనుస్సు :— ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారంఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు—నూతన విషయాలను తెల్సుకొంటారు. అనుకూలమైన వార్తలను వింటారు.

మకరం:— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

కుంభం :— ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వ్యతిరేకమైన వార్తలనువింటారు. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

మీనం :— వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో వ్యతిరేక పరిస్థితి ఏర్పడుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

సీరియల్

# మనుగడలో మలుపులు

జీడిగుంట రామచంద్రమూర్తి

(గత సంచిక తరువాయి)

**'సిటీబస్'** కోసం అరగంటసేపు 'బస్ స్టాప్'లో నిలబడ్డ కారణంచేత, బస్ఎక్కగానే తల నొప్పిగా అనిపించింది సూర్యానికి ! సెక్రటేరియట్ దగ్గర బస్ దిగిపోయి, కామత్ హోటల్లోకి వెళ్లి కూర్చుని 'కాఫీ'కి ఆర్డరిచ్చాడు.

'హలో' అంటూ పలకరించాడు అక్కడకు కొంచెం దూరంలో వున్న టేబిల్ముందు కూర్చుని మిత్రులతో కాఫీ త్రాగుతున్న రంగనాథ్.

"చాలా రోజులయింది మనం కల్సుకుని !" అన్నాడు సూర్యం అక్కడికే వచ్చి కూర్చుని.

"అవును ! అన్నట్టు చెప్పటం మరచాను. సుగుణ లలిత సంగీతం పోటీలో 'ఫస్ట్' వచ్చింది. నిన్ననే ఫలితాలు తెలిశాయి." అన్నాడు రంగనాథ్.

"వెరీ గ్లాడ్ ! మంచి వార్త చెప్పావ్. మరి యీ విషయం సుగుణకు తెలియచేశావా ?" అడిగాడు సూర్యం కాఫీ త్రాగుతూనే.

"ఇంకా 'అనౌన్స్' చేయలేదు ! 'అఫీషియల్'గా తెలియచేయటానికి మరో నాలుగురోజులు పడుతుంది. మరింత కృషిచేస్తే సుగుణకు మంచి భవిష్యత్తు వుంటుంది."

"అవును ! ఆమెచేత కృషి చేయించే బాధ్యత నేను తీసుకుంటాను." అంటూ అక్కడ్నుంచి లేచి, రంగనాథ్ దగ్గర శలవు తీసుకున్నాడు సూర్యం.

మరో అయిదు నిముషాలకు ఆటోరిక్షా – 'బంజారా హిల్స్' లోని – రాజారాంగారి భవంతి ముందు ఆగింది.

గేటు తీసుకుని లోపలకు వెడుతున్న సూర్యానికి యెడమకన్ను ఒక్కసారిగా అదిరినట్లయితే – కుడి చేత్తో కంటిని గట్టిగా హత్తుకున్నాడు.

లోపలకు అడుగువెట్టిన సూర్యానికి పరిసరాలన్నీ వెలవెల పోతున్నట్లనిపించాయి. మనసు ఏదో కీడును శంకిస్తూంటే 'సుగుణా' అని పిలిచాడు. ప్రక్క గదిలోంచి వచ్చిన రాజారాంగార్ని చూసి కొంచెం కుదుటపడ్డాడు.

ఆయన వచ్చి అక్కడి సోఫాలో కూర్చున్నారు. చేసుకోని గడ్డం మాసిపోయింది. వేసుకున్న బట్టలు నలిగిపోయాయి. కళ్లు ఎర్రగా వాచినట్లున్నాయ్.

"సిరిపురం నుంచి మా మావయ్య వచ్చాడు. ఓసారి ఆయన్ని మీకు పరిచయం చేద్దామని, ఇక్కడకు కూడా తీసుకొచ్చాను. కానీ ఆరోజున మీరు ఇంట్లో లేరు ! ఆయన వ్యవహారాలలో పడి– యీ వారంరోజులూ మీ ఇంటికి రాలేకపోయాను." క్షమాపణ చెప్పుకుంటున్న ధోరణిలో అన్నాడు సూర్యం

"నువ్ రాకపోవటమే మంచిదయింది సూర్యం !"

అర్థంకాలేదు సూర్యానికి.

"వచ్చివుంటే – సుగుణ ఎలా చచ్చిపోయిందీ నువ్ కళ్లారా చూసివుంటే – నీ పరిస్థితీ యిలాగే వుండేది !"

"రాజారాంగారూ ?!" ఏదో షాక్కొట్టినట్టు అరిచాడు సూర్యం. వినకూడని మాట విన్నప్పుడు చేసే ఆర్తనాదంలా లేదు. బలవంతంగా చనిపోయేటప్పుడు వేసే చావుకేకలా వుంది.

రాజారాంగారు చలించలేదు.

గబగబా వచ్చి రాజారాంగారి కళ్లల్లోకి చూస్తూ–

"మీరంటున్నది నిజమా ? చెప్పండి !" అంటూ మళ్లీ అరిచాడు.

అంతకుముందే మేడమీద నుంచి క్రిందకు వచ్చిన డాక్టర్ మోహన్– సూర్యం భుజంతట్టాడు ఓదార్పుగా.

"నిజమే సూర్యం ! నిన్నటిపాటికే అన్నీ ముగిసిపోయాయి..." అన్నాడు మోహన్.

బాధతో కళ్లుమూసుకున్నాడు సూర్యం.

"సుగుణ కుంటిదిమాత్రమే కాదు సూర్యం ! కేన్సర్ పేషెంట్కూడా ! యీ విషయం, మాకు తెలిసీ, ఆమెకు తెలియనివ్వకుండా దాచుకున్నాం. ఆ విషయాన్ని తెలుసుకున్న సుగుణకూడా తన వ్యాధిని పైకి తెలియనియ్యకుండా దాచుకుంది ! దాచుకున్నా దాగని వ్యాధి సుగుణను పొట్టను పెట్టుకుంది. కానీ చివరి నాలుగు రోజుల్లోనూ – ఆ వ్యాధితో సుగుణ పడిన బాధను చూస్తూంటే – సుగుణ త్వరగా చచ్చిపోతేనే బాగుండుననిపించింది."

మోహన్ చెబుతూంటే ఏడవటానికి సూర్యం కనురెప్పలు విడివడలేదు. గొంతులోంచి మాట పెగిలిరాలేదు.

అంతలో ఏదో గుర్తుకువచ్చినవానిలా–

"అన్నట్టు సూర్యం ! నీకోసం ఎదురుచూసిన సుగుణ యీ వుత్తరం రాసిచ్చింది... నీకు అందచేయమంది"– అంటూ తన లాల్చీ జేబులోంచి ఓ కాగితం మడతను తీసి సూర్యానికి అందించాడు

ఆ వుత్తరాన్ని ఆత్రుతగా అందుకుని– కళ్ళతోనే గబగబా చదువుకున్నాడు సూర్యం...

"సూర్యంగారూ...

... ... ...రెండు రోజులనుంచీ మీరు వస్తారేమోనని ఎదురుచూశాను..కాని రాలేదు...ఎందుకో, మిమ్మల్ని మళ్లీ చూడలేనేమోనని అనిపించింది. అందుకే చెప్పదల్చుకున్న నాలుగు మాటలూ యీ వుత్తరం ద్వారా తెలియజేస్తున్నాను......

"నాకు 'కాన్సర్' వ్యాధి వుందని తెలుసు! ఆ విషయాన్ని నాన్నగార్కి డాక్టర్గారు చెబుతూంటే నేనూ విన్నాను ఎపుడో!... కానీ నామీద ప్రేమతో మా అన్నయ్యలూ, నాన్నగారూ, అ విషయం నాతో చెప్పకుండా దాచిపెట్టారు!... చిన్నప్పుడే పడిపోయిన నా కాలికి శక్తి వస్తుందని మభ్యపెడుతూ ఏవేవో మందులూ ఇంజక్షన్లూ యిప్పించేవారు!... కానీ... అవన్నీ కాన్సర్ వ్యాధికి పనిచేసేవని నాకు తెలిసినా, పనిచేయాలని వాటికి తెలియలేదు...

"... ... ఇలాంటి తుదిరోజులు వస్తాయని నేను ఎప్పటినుంచో అనుకుంటున్నా... అనుకోకుండానే ఓ రకమైన నిర్లిప్తత నాలో చోటు చేసుకుంది... తాము పెళ్లిచేసుకుని, భార్యా పిల్లలతో సరదాగా వుంటే– నా మనస్సెక్కడ చలిస్తుందోనని మా అన్నయ్యలు కూడా పెళ్లిళ్లు మానేశారు!... నేను నవ్వుతుండాలని అనుక్షణం తాపత్రయపడేవారు కానీ... చిన్నన్నయ్య అమెరికా వెళ్లిపోవాల్సివచ్చింది..

***జరిగిన కథ 9 :*** తన చిన్ననాడే తమతో సంబంధం తెంపుకున్న మేనమావ వెంకట్రామయ్య ఇంటికి వెళ్తాడు సూర్యం. వెంకట్రామయ్య భార్య వర్ధనమ్మ. కూతురు రాధ. తన తల్లి బ్రతికుండగానే తన పెళ్లాంగా ముద్ర వేయించుకున్న రాధ ఎలా వుంటుందో తెలీకపోయినా ప్రాణప్రదంగా ప్రేమిస్తాడు సూర్యం. రాధని తనకిచ్చి పెళ్లి చేయటం వెంకట్రామయ్య కిష్టంలేదని తెలిసిన సూర్యం ఆ వూరి నుంచి వచ్చేస్తాడు. కమతగాడైన తనను ఆదిశేషయ్య అల్లుడిగా చేసుకోవటం, భార్య శాంత మరణం, వెంకట్రామయ్య ప్రవర్తన, తనను ఆదుకున్న రాజారాంగారు అందరూ గుర్తుకొస్తారు శేషగిరికి. రాధను సూర్యాని కిమ్మని అడగవచ్చిన శేషగిరిని అవమానిస్తాడు వెంకట్రామయ్య. పరిస్థితులతో రాజీపడి ఉద్యోగంలో చేరాలనుకున్న సూర్యం రాజారాంగారి దగ్గరకు హైదరాబాద్ వెళ్తాడు. రాధకు ఎండోమెంట్స్లో పని చేస్తున్న శ్రీపతితో వివాహమైందని తెలిసి బాధ పడ్తాడు సూర్యం. రాజారాంగారి కూతురు సుగుణకు కుంటితనం. రాజారాంగారి సాయంతో వుద్యోగం సంపాదించుకున్న సూర్యం సుగుణపట్ల శ్రద్ధ చూపుతాడు. శ్రీపతి దుర్వ్యసనాలతో తన ఆస్తిని తగలెయ్యడమే కాక రాధను రాచిరంపాన పెడుతున్నాడని వాపోయిన వెంకట్రామయ్యకి తాను శ్రీపతిని మార్చి రాధ కాపురం సరిచేస్తానని చెప్పి ఓదారుస్తాడు సూర్యం. కాబరే డాన్సర్ యామినిని బలవంతం చేయబోయి పరాభవం పాలయిన శ్రీపతి, తన మిత్రుడి పాశవిక వాంఛకు గురవుతున్న రాధను సూర్యం రక్షించాడని తెలుసుకుని మారతాడు. తన గత చరిత్ర చెప్పిన యామినితో దారుణంగా హత్య చేయబడిన ఆమె తల్లి వసంతకోకిలాన్ని పెళ్లి చేసుకుంది వెంకట్రామయ్యేనని, ఆమె తమ్ముడు రాజు వెంకట్రామయ్య యింట్లోనే పనివాడుగా వుంటున్నాడని చెప్తాడు సూర్యం.

పెద్దన్నయ్య ఎక్కువగా ఇంట్లోనే వుండడు...

"... ...ఇక నాన్నగారికి—ఆయన వ్యవహారాలు ఆయనవే!... ఒంటరితనంతో మరింత నిర్వేదాన్ని పెంచుకుంటున్న తరుణంలో— మీ సాంగత్యం దొర కటం నా అదృష్టంగా భావించాను... మీ మంచి తనాన్ని నాకూ పంచి యిచ్చారు!... మీ మాటల తోటే, నవ్వులతోటే నన్ను కట్టేశారు... పుస్తకాలు చదివించారు! పాటలు పాడించారు!... వున్నన్నాళ్ళూ బ్రతకాలనే ఆశను కల్పించారు... ...

"... ...కానీ యింక నాలో ఆ ఆశ కొడిగడు తోంది... అయితే మీ మాటలు వింటూ గడపాలనే ఆశ మాత్రం నాకింకా తీరలేదు!... అందుకే మీరు త్వరగా పెళ్లి చేసుకోండి!... అపుడు నేనే మీ యింట్లో పుడతాను... మరుజన్మలోనైనా మనసు తీర్చుకుంటాను...

...శెలవు
మీ సుగుణ..."

సూర్యం వుత్తరం చదువుతున్నంతసేపూ, అతని కళ్ళనుంచి కన్నీటి చుక్కలు బొటబొటా రాలుతూనే వున్నాయి...

తన సంగీతంతో మనుషుల్ని మెప్పించి—బహూ మతు లందుకున్న సుగుణ దేవతలనుకూడా మెప్పించి మన్ననలను అందుకోవటానికి అమరలోకాలకు వెళ్లి పోయిందనుకున్నాడు ఆ క్షణాన!...

* * *

సూర్యం మనసంతా కల్లోలమయిపోయింది. రాజారాంగారి యింటినుంచి తిన్నగా 'పబ్లిక్ గార్డెన్స్' కు చేరుకున్నాడు... చీకటి పడేదాకా అక్కడే కూర్చున్నాడు... ఆ తరువాత యింటికి చేరుకునేసరికి ఎనిమిది గంటలు దాటిపోయింది... వెంకట్రామయ్య పడకకుర్చీలో కూర్చుని భగవద్గీత చదువుతున్నాడు... కొంచెం దూరంగా గోడనాను కుని కూర్చున్న రాజా ఏదో పుస్తకంలోని బొమ్మలు చూస్తున్నాడు...

గదిలోకి వచ్చిన సూర్యంవైపు ఆత్రంగానూ, ఆశగానూ చూశాడు వెంకట్రామయ్య. అతను తనకో మంచిమాట చెప్పాలనీ, ఆ మంచిమాట రాధ భవిష్యత్తుకో అమూల్యమైన వరం కావాలనీ— అలివేలుమంగమ్మకు మొక్కుకున్నాడు.

"భోజనంచేశారా మావయ్యా ?" సూర్యం అడిగిన ప్రశ్నకు నీరుకారిపోయాడు.

రాధ బ్రతుకు కుదుటపడుతుందనే ఆశ కనిపించేవరకూ భోజనం చేసినా చెయ్యనట్టే వుంటుందనీ — కళ్లు మూసుకున్నా కలత నిద్రేనని చెప్పాలనుకున్నాడు. కానీ చెప్పలేక 'చేశా(నా' అన్నాడు.

సూర్యం మరేమీ మాట్లాడలేదు.

"నిన్నా మొన్నా యింటికి రాలేదే ?" అడి గాడు వెంకట్రామయ్య, అలసిపోయినట్లు కని పిస్తున్న అతని ముఖంలోకి — నిద్రలేని సూర్యం కళ్ళల్లోకి చూస్తూ.

అక్కడున్న కుర్చీలో కూర్చుని — బూటు లేసులు విప్పుకుంటూ—

"నిన్నా మొన్నా రాధ ఇంట్లోనే వుండి పోయాను." అన్నాడు సూర్యం.

ఇంకా ఏదో చెప్తాడన్నట్టుగా మౌనంగా సూర్యంవైపు చూస్తూండిపోయాడు వెంకట్రా మయ్య.

"కొన్ని సంఘటనలూ, కొన్ని క్షణాలూ, యెలాంటి మలుపు తిరుగుతాయో — మనుషులపై యెలాంటి ప్రభావాన్ని చూపిస్తాయో—ఆ మనుషుల జీవితాల్లోకి చూస్తే తెలుస్తుంది మావయ్యా !"

"నువ్ ఏం చెబుతున్నావో నా కర్థంకావటం లేదు. ఇంతకీ నువ్ వెళ్లిన పని ఏమయింది ? శ్రీపతిని కలుసుకున్నావా ?"

"కలుసుకున్నాను ! ఇప్పుడు శ్రీపతి మారి పోయాడు ! యికనుంచీ అతనికి రాధపట్ల అను రాగాన్నే చూస్తావ్‌గానీ - రాధలోని ఆవేదనను చూడక్కర్లేదు మావయ్యా !"

"అయితే శ్రీపతి ఏమన్నాడు?"— వెంక ట్రామయ్య ప్రశ్నలో ఆతృత స్పష్టంగావినిపించింది.

అంతకుముందు రాధయింట్లో జరిగిన అల్లరీ, ఆ తరవాత శ్రీపతివచ్చి విషయం తెల్సుకుని పశ్చా త్తాపపడిన సంగతీ టూకీగా వివరించాడు సూర్యం..

వెంకట్రామయ్య ఆనందానికి అవధుల్లేవు...

"ఆ భగవంతుడు నా మొర ఆలకించాడన్న మాట..." కళ్లల్లోంచి నీళ్లు జలజలా రాలు తూంటే— ఆ కళ్లు మూసుకుని కనిపించని దేవు డికి చేతులెత్తి నమస్కరించాడు.

"మంచివాళ్ల మొరలు ఆలకించడమే కాదు మావయ్యా— వాళ్లకు మంచినికూడా చేస్తాడు ఆ భగవంతుడు' — సూర్యం అన్నాడు...

"భగవంతుడు చేసిన మంచి నన్ను చూసే అయితే అది ఎంతోకాలం నిలబడదురా!... నీ మంచి తనాన్నిచూసి చేసి వుంటాడు... నువ్ కనిపించే దేవుడివిరా సూర్యం!..." అంటూ గబగబా వచ్చి మేనల్లుణ్ణి కౌగలించుకున్నాడు...

ఉక్కిరి బిక్కిరి అయిన సూర్యం కళ్లలో కూడా కన్నీరు నిలిచింది...

రాధను తనదానిగా చేసుకోలేక పోయినందుకో? ఆ రాధ కాపురం నిలబడినందుకో? ... ఆ కన్నీటికి అర్థం తెలుసుకోవలసిన అవసరం వెంకట్రామయ్యకు కలుగలేదు..

అంతవరకూ గోడదగ్గర కూర్చుని, బొమ్మలు చూస్తున్నరాజా, అపుడే అక్కడకువచ్చి అయో మయంగా వాళ్లిద్దర్నీ చూస్తూ నిలబడ్డాడు..

"రేయ్ సూర్యం!... ఇవాళ నాకు ఎంత సంతోషంగా వుందో తెలుసా?... ఒకనాడు మీ అమ్మకు యిచ్చిన మాట ప్రకారం నా రాధని నీకివ్వలేకపోయినా ఆనాడు మా నాన్నకిచ్చిన మాట ప్రకారం, వున్న ఆస్తిలో సగం నీకు రాసిస్తాను... పెళ్లి చేసుకుని హాయిగా వుండు!... నాకెలాగా కొడుకులు లేరు!... రేపు నేను రాలిపోతే — నా కోసం ఒక్క కన్నీటిచుక్క రాల్చి —నా తలకు కొరివి పెట్టు ! అప్పుడే నా ఆత్మకు శాంతి చేకూ రుతుందిరా !..." వెంకట్రామయ్య ఏడుస్తున్నాడు.

సూర్యం నిట్టూర్చాడు.



# యువతరం

పందొమ్మిది సంవత్సరాల జంధ్యాల నాగేశ్వరరావుకి వాళ్ల వూరు అంటే తాడేపల్లిగూడెంలో చాలా ఏక్టివిటీస్ వున్నాయి. ప్రభుత్వ కళాశాలలో రెండో సంవత్సరం బి. కామ్. చదువుకుంటున్నాడు. కలం పేరు కూడా వుంది మంచిది. "కళ్యాణ్" అని. యన్. యస్. యస్. లో వర్కింగ్ కమిటీ మెంబరు "అరసంలో కూడా కార్యవర్గ సభ్యుడు! ఇలా అంటున్నాడు ఈ వర్ధమాన రచయిత.



అమ్మాయిలంటే నాకెంతో యిష్టం. వాళ్లతో కాలక్షేపానికి చక్కగా మాట్లాడాలని ప్రయత్నిస్తాను. కాని హేళన చేయటానికి ప్రయత్నించను. అందుకే ఎక్కడా పరాభవం సంభవించలేదు నాకు.

ప్రేమ అనేది ఇద్దరిమధ్యా కనపడకుండా కల్గియుండే ఒక పవిత్ర స్వరూపం అంటాను నేను. వివాహ వ్యవస్థను త్రోసివుచ్చాలని నా ఆశయం. వివాహ వ్యవస్థకు స్వస్తి చెప్పినంత మాత్రంలో దేశంలో అల్లకల్లోలాలు ఏర్పడవని నా ఉద్దేశ్యం. వివాహ వ్యవస్థ ఆచారంగా వస్తోందని తలవంచనవసరంలేదు. పూర్తి నమ్మకం వుంటే యధార్ధ బ్రహ్మచారిగా ఉంటే బాగుంటుందేమో.

శ్రీమతి ఇందిరాగాంధి గూర్చి ఆలోచిస్తే చక్కని పరిపాలనా దక్షత కల్గిన ఒక అపూర్వ స్త్రీమూర్తి అనిపిస్తుంది నాకు.

తల్లి దండ్రులు దైవస్వరూపులు. ఈ దైవ స్వరూపులు మూఢాచారాలను పిల్లలపై రుద్దక, మారుతున్నకాలంతో మారుతూ పిల్లలఅభిరుచులను, ఉద్దేశ్యాలను తెలుసుకుంటూ ఉండాలి.

నేడు విడుదలవుతున్న సినిమాలలో నీతితక్కువ. శృంగారం కాదు అసభ్య సన్నివేశాలెక్కువ. ఈ శృంగార – అసభ్య సన్నివేశాలను వర్ణ చిత్రాలలో ప్రేక్షకులకు అందిస్తూ సంఘాన్ని మారుదారి పట్టించేందుకు ఎక్కువ దోహదం చేస్తున్నాయి, ఈ సినిమాలు. అందుకే సినిమాలు తక్కువగా చూస్తాను.

తెలుగు చలనచిత్ర లోకంలో నా అభిమాన నటుడు శ్రీ అక్కినేని అంటాను. నాకు అభిమాన తార కరువయ్యారు తెలుగు చలనచిత్ర పరిశ్రమలో. ఈ తెలుగు తారలు అసభ్య ప్రవర్తనలుచేసి అభిమానం చూరగొనాలనుకుంటారు. అందుకే నాకు తెలుగు తారలంటే అవిశ్వాసం. హిందీ భాషలో హేమమాలిని ఒక అపూర్వనటి అంటాను.

అంతేకాదు. పేపర్లో కవులకి రచయితలకి సన్మానాలైన వార్తలు చదువుతాడట! [అవెన్నేసి పడతాయేం?] ఉక్కిరిబిక్కిరైపోయేటంత ఉత్సాహం. ఏంబిషన్‌లు వున్న నాగేశ్వరరావు గ్రాడ్యుయేట్ అయ్యాకే తన ఆశయాలు అమలులో పెడితే సేఫ్టీ ఎక్కువ కనుక మంచిమార్కుల కోసం ప్రయత్నిస్తాడని ఆశిస్తాను. [పి★★]

తను పెళ్లి చేసుకోవాలి...! నిజమే! కానీ ఎవర్ని? మొదటినుంచీ ఆశలు పెట్టుకున్న రాధ తనదికాకుండా పోయింది. మధ్యలో వచ్చి మమతలు పంచిన సుగుణ సృష్టిలోని తియ్యటి స్నేహాన్ని తనకు చూపించకుండా – మధ్యలోనే దూరమయిపోయింది. మరొకరు తన జీవితంలోకి ప్రవేశించేసరికి – యెంత పొద్దుపోతుందో?

"ఏం సూర్యం! ఇష్టంలేదా? పోనీ నా తలక్కొరివి పెట్టద్దులే! నా ఆస్థిలో భాగాన్ని తీసుకుంటానని చెప్పు. నేను మీకు అన్యాయంచేసినా సహించి, అవమానించినా భరించి, ఇవాళ నా కూతురి కాపురాన్ని నిలబెట్టినందుకు ఇలాగైనా నీ ఋణం తీర్చుకోనీయ్! అంతే నేను కోరుకునేది!" తన రెండు చేతుల్నీ పట్టుకుంటున్న మావయ్యను వారిస్తూ –

"ఛ! ఛ! ఏమిటి మావయ్యా ఆమాటలు! అయినా నేను చేసిన సహాయం ఏముందీ? రోడ్డు మీద బండి నడుస్తూంటే అప్పుడప్పుడు గతుకుల్లో పడక తప్పదు. రోడ్డు ధర్మమే అంత! జీవితంలో కూడా అలాంటి గతుకులు తప్పవు మావయ్యా!" సవ్యసాచికి గీతను బోధించిన పరమాత్ముని లా కనిపించాడు సూర్యం వెంకట్రామయ్యకు.

రెండు నిముషాలు ఆ గది అంతా నిశ్శబ్దం అలుముకుంది.

"నీకు వసంతకోకిలం తెలుసుకదూ మావయ్యా?" ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ వచ్చిన సూర్యం ప్రశ్న విని ఉలిక్కిపడ్డాడు వెంకట్రామయ్య. ఆకాశం చిల్లులుపడి నిప్పులవర్షం కురుస్తున్నట్లూ – తన కాళ్లక్రింది నేల కరిగిపోయి – తను అగాధాల్లోకి జారిపోతున్నట్లూ అనిపించింది.

జీవంలేని కళ్లతో సూర్యాన్ని చూశాడు.

## మనుగడలో మలుపులు

'ఏమిటి?' 'ఎందుకూ?' అనే ప్రశ్నలు అడుగుతున్నట్టున్నాయి ఆ రెండు కళ్లూ.

"తెలిసినా మరచిపోయుంటావు." అన్నాడు సూర్యమే మళ్లీ.

"లేదు! మరచిపోలేదు సూర్యం! నాకు అంతా గుర్తుంది." దాదాపు అరచినంత గట్టిగా అన్నాడు వెంకట్రామయ్య. చెప్పబోయేది వినటానికి సిద్ధంగా వున్నాడు సూర్యం.

"నేను పట్నంలో చదువుకునే రోజులవి! మా క్లాసులో వున్న ఆడపిల్లలందరిలో– చాలా అందంగా కనిపించేది వసంతకోకిలం. మేమిద్దరం ప్రేమించుకున్నాం. పెళ్లికూడా చేసుకోవాలనుకున్నాం. కానీ కులంతక్కువ పిల్లను చేసుకుంటే నాన్న ఒప్పుకోడనీ – ఒకవేళ ఆయన మాటను కాదని చేసుకున్నా ఆస్థిలో నాకు భాగం యివ్వకుండా తరిమివేస్తాడనీ భయపడి రహస్యంగానే మేమిద్దరం పెళ్లి చేసుకున్నాం.

...ఇది జరిగిన కొంతకాలానికే నాకు నాన్న, మరో సంబంధాన్ని స్థిరపరచారు. జరిగింది చెప్పలేకా – జరిగేది ఆపలేక–నిస్సహాయంగా పరిస్థితికి లొంగిపోయాను. మీ అత్తయ్యను అగ్నిసాక్షిగా పెళ్లి చేసుకున్నాను. ఈలోగా అక్కడ వసంతకోకిలం ఆడపిల్లను ప్రసవించింది.

...ఈ ఊళ్లోనే ఓ చిన్న యిల్లు తీసుకుని వాళ్ళిద్దర్నీ యిక్కడ వుంచాను. ఏదో సాకుచెప్పి – తరచుగా యిక్కడకు వచ్చి ఆమెకు ధైర్యం చెప్పేవాణ్ని. అవసరమయిన డబ్బు యిచ్చేవాణ్ని! పాపకు 'యామినీ' అని వసంతే పేరు పెట్టుకుంది. చదువు సంధ్యలతోబాటు, ఆటపాటలు కూడా నేర్పించింది.

...ఇంతలో నాన్న పోవటం – ఇంటి బాధ్యతలూ పొలం పనులూ, అన్నీ చూసుకోవాల్సి రావటంతో నేను హైదరాబాద్ రావటం తగ్గించవలసి వచ్చింది. వసంత మళ్లీ గర్భవతి అయిందన్న విషయం తెలిశాక రావటమే మానేశాను.

చెప్పటం ఆపి సూర్యంవైపు చూశాడు వెంకట్రామయ్య...

"అయితే ఆవిడ ఇపుడు... ... ..."

"లేదు సూర్యం! చచ్చిపోయింది"– అన్నాడు సూర్యం ప్రశ్నను మధ్యలోనే త్రుంచేస్తూ...

"కాదు"– సూర్యం పెద్దగా అన్నాడు.

"రక్తం మడుగులో గిలగిలా కొట్టుకుని మరీ ప్రాణాలు కోల్పోయింది"

"ఆఁ!"... వెంట్రామయ్య లేచాడు... వికృతంగా సూర్యంవైపు చూశాడు. భయంతో వణికిపోయాడు.. అతన్ని మళ్లీ కూచోబెడుతూ సూర్యం అన్నాడు.

"మావయ్యా! నేను చెబుతున్నది నిజమే!... ఆవిడను ఎవరో దారుణంగా హత్యచేశారు"– అని...

వసంతకోకిలం విషయం సూర్యానికి ఎలా తెలిసిందో అర్ధం కాలేదు వెంకట్రామయ్యకి.. ఇంక దాచటం అనవసరం అనుకున్నాడు. అందుకే అన్నాడు–

"అవును! వసంత హత్య చేయబడింది... ఎదిగొచ్చే యామిని జీవితాన్ని నిర్దేశించమనీ, కడుపులో మళ్లీపడ్డ నలుసును కరుణించమనీ కాళ్లా వేళ్లా పడితే కాదు పొమ్మన్నాను. ఆ తరువాత రెండు మూడు సార్లు ఉత్తరాలు రాసింది వసంత... మనిషినికూడా పంపించింది... నేను నిర్లక్ష్యం చేశాను. ఎదిగిన పిల్లకి పెళ్లి చేయాలనీ– ఎదిగివస్తున్న పిల్లాడికి చదువు చెప్పించాలనీ– అందుకు ఏదైనా ఏర్పాటు చేయకపోతే తాను కోర్టుకు కూడా వెళ్లవలసి వస్తుందనీ– బెదిరిస్తూ మళ్లీ మరో ఉత్తరం రాసింది వసంత! నాకేం చేయాలో తోచలేదు.

కళ్ల ముందున్న భావి, లోతైన దిగుడు బావిలా కని పిస్తే ఆ బావిలో నేను దిగలేక, ప్రాణప్రదంగా నన్ను ప్రేమించిన వసంతను— అదే బావిలోతోశాను నేనే హత్య చేయించాను''—

ఏడుపూ—వెక్కిళ్లూ ఏకమై వస్తుంటే క్షణం సేపు ఆగి—తేరుకుని—మళ్లీ అన్నాడు వెంకట్రామయ్య.

''నేను నా చేతులారా చంపినా బాగుండేది! డబ్బు తిన్న ఆ కర్కోటకుడు కత్తితో పొడిస్తే— కమ్మగా పాడే కోకిలం గొంతు, రక్తంతో తడిసి నన్ను కలవరిస్తూ చనిపోయి వుంటుంది...''

''నిజమే మావయ్యా! పాపం — అత్తయ్య నిన్ను ఎలుగెత్తి ఎలా పిలిచిందో సాక్ష్యం వున్నా — ఆ గొంతు నిర్దయగా పూడిపోయింది.'' దిగులుతో రాజావంక చూశాడు సూర్యం.

సూర్యాన్నీ—రాజునీ—మార్చి మార్చి చూస్తున్న వెంకట్రామయ్య పెద్దగా అడిగాను — ''అంటే ?''

''రాజు మరెవరోకాదు మావయ్యా! అత్తయ్య చావుని కళ్లారా చూసి, గొంతు పోగొట్టుకున్న నిర్భాగ్యుడు!''

''సూర్యం...'' వెంకట్రామయ్య ఆవేశంగా అన్నాడు. ''ఇవన్నీ నీకెలా తెలుసు ? ఎప్పట్నుంచీ తెలుసు ? నాకెందుకు చెప్పలేదూ ?''

''నిన్ననే — యామిని చెప్పింది.''

వెంకట్రామయ్య లేచాడు. ''యామిని ఇక్కడే వుందా ?''

''ఉంది మావయ్యా! కన్నకూతురే అయినా నీ కళ్లముందు నిలబడటానికి వెనుకాడుతోంది.''

''వద్దు సూర్యం! యామినిని నా కళ్ల ముందుకు రావద్దను! దానిముందు నేను దోషిలా నిలబడలేను. దాని చూపుల్లో వసంత కనిపిస్తే నేను తట్టుకోలేను!'' పసిపిల్లాడిలా ఏడుస్తూ అన్నాడు వెంకట్రామయ్య.

''లేదు మావయ్యా! యామినే నిన్ను చూడాలని ఎంతగానో పలవరిస్తోంది!''

నిర్విణ్ణుడయిన వెంకట్రామయ్య చుట్టూ చూశాడు. భయం భయంగా నిలబడిన రాజు కని పించాడు.

''సూర్యం...కనీసం వీడ్నయినా నాబారినుంచి రక్షించు!... ఈ దుర్మార్గుడే వాడికి 'నాన్న' అనే విషయాన్ని తెలియనివ్వకుండా చూడు!...''— అన్నాడే కానీ— జాలి జాలిగా చూస్తున్న రాజుని ఒక్కసారిగా వెళ్లి ఒళ్లోకి తీసుకుని ముద్దులవర్షం కురిపించకుండా వుండలేక పోయాడు వెంకట్రామయ్య...

సూర్యం ఆనందాశ్రువుల్ని తుడుచుకున్నాడు...

''బాబూ!... నీఋణాన్ని ఇంతత్వరగా ఎందుకు తీర్చేశావురా? కొడుకువని తెలియక, నిన్ను పేడ కళ్లు తీయలేదేమని కొట్టాను!... నాకు నిద్ర వచ్చే దాకా నాకాళ్లు వత్తించుకున్నాను... 'నాయనా'— 'నా రాజా' అని పిలవటం తెలియక— 'మూగోడా' అని కేక వేశాను!...''—

రాజు వెంకట్రామయ్య తలను నిమురుతూంటే వెంకట్రామయ్య విపరీతంగా ఏడ్చాడు...

తేప్పరిల్లుకున్నాక... ''సూర్యం...! నేనుచేసిన పాపాలకు నువ్ నన్ను చంపలేవు... నన్ను నేను చంపుకునే ధైర్యంలేక నా చుట్టూ నరకంలాంటి గూడు కట్టుకున్నాను... నాకు శిక్షలేదు...''— అన్నాడు...

''బాధపడకు మావయ్యా! పశ్చాత్తాపం మరే కఠిన శిక్షకూ తీసిపోదు...''—

''అవును! నా పశ్చాత్తాపపు శిక్ష యింకా పూర్తికాలేదు... నన్ను యామిని దగ్గరకు తీసుక పో... నా తల్లి ఒడిలోవిడ్చి ఈ శిక్షనుంచి బయట పడతాను...''—

''లేదు మావయ్య... యామిని మంచితనం రాధ మనస్తత్వానికేం తీసిపోదు! రాధా — యామినీ, నిన్ను కళ్లల్లో పెట్టుకుని పూజిస్తారు!... అన్నట్టు మనం కంటి ఆస్పత్రికి ఎప్పుడు వెడదాం మావయ్యా?...'' అడిగాడు సూర్యం...

''వద్దు బాబూ! ఈ కళ్లని ఇలాగేవుండనీయ్... పాతచూపు నా కసలొద్దు! నువ్ చూపించే దారి కనిపించక మళ్లీ తప్పిపోతాను... ఆ దేవుడ్నే మరచి పోతాను.''—అంటూ చేతులెత్తి నమస్కరించాడు వెంకట్రామయ్య...

''తప్పు మావయ్యా!''— అంటూ చలించి పోయిన సూర్యం ఆ చేతుల్ని క్రిందకు దించాడు.

సూర్యం రెండు చేతుల్నీ తన చేతుల్లోకి తీసు కుని ముద్దుల వర్షం కురిపించాడు రాజు...

## 16

సూర్యానికి అంతా చీకటిగా వుంది......

'కొడుకునీ—కూతుర్నీ తెచ్చి చూపించావనీ—




రాధ కాపురం నిలబెట్టావనీ— నీ మంచితనంతో నాకు శిక్ష విధించావనీ'— మావయ్య మెచ్చుకుంటే తాను పొందిన గర్వాన్నంతా— సహృదయమున్న సుగుణ ముందు తెలియచెప్పి— తృప్తిగా బరువు దించుకుందామంటే, ప్చ్... సుగుణ తనకి చీకటినే వదిలేసింది!... వీళ్లందరి ఆనందంతో తాను తల మునకలవుతూంటే— వెన్నెలవెంట చీకటన్న విషయం నిరూపించటానికి శూన్యంలో కలిసి పోయింది!!

సూర్యానికి కొండల్లో దిగిపోతున్న ఎర్రటి సూర్యుణ్ణి తిట్టాలనిపించింది... తననలా దిగులుకు వదిలేసిన నేరం అతనిమీద మోపి కొట్టాలని పించింది!... ఎంత వైరితనం తనది?...

—అలా పిచ్చిపిచ్చిగా ఆలోచిస్తున్న సూర్యం దూరంగా కన్పించిన వ్యక్తిని ఆనవాలు పడుతూ అప్ర యత్నంగా అక్కడకు చేరాడు...

''యామినీ!''...

పిలిచాడు...

''మీరా ?'' ఉలిక్కిపడింది యామిని.

''ఏమిటీ ఆలోచిస్తున్నావ్ ?'' అడిగాడు సూర్యం.

''ఏమీలేదు! 'ఎవరికైనా చెప్పుకోవటానికి ఏముందా' అని నా గతాన్ని తిరిగ్గా వెతుక్కుంటు న్నాను. నా యీ రాత్రి ముగిసి ఉదయాన్ని తెప్పించే పొడవని వేగుచుక్కకోసం—భావి ఆకాశంలో పిచ్చిగా వెతుకుతున్నాను.''

''యామిని! నీకేమయిందిప్పుడు ?''

''సూర్యం! నీ మంచితనం నీకే చెప్పి — నిన్ను కించపరిచే మూర్ఖురాల్ని కాదు నేను! పరిస్థితుల నెదుర్కోలేక అనుక్షణం బాధపడి పశ్చాత్తాపంతో కుమిలిన నాన్నా — అమాయకంగా పెరిగి, అంతా మంచిదే అనుకుంటూ మెరిసే కళ్లతో చూసే రాధా — అంతా తెలిసినా ఏమీ మాట్లాడక మౌనంగా పలకరించే రాజూ — మీరందరూ మంచివాళ్లు!''

''అయితే ?''

''నన్ను గురించి చెప్పుకోవటానికి నాకేం మిగిలింది ? వట్టి యామినిని! ... అందరూ భయపడే యామినిని! కటికచీకటిని!''

''అని నువ్వనుకుంటున్నావ్! ఆ చీకటే తోడులేకపోతే పగలు ఎంత భయపడుతుందో నువ్ ఊహించావా ?''

''బావా...'' యామిని కళ్లల్లో కన్నీరు మెరిసింది.

''అవును యామినీ! నువ్ చీకటివి ... నేను వెలుగును! మనిద్దరి కలయికే ఈ సంధ్య. మన జీవితంలో యెన్నో సంధ్యాసమయాలు వచ్చి వెళ్లిపోయాయి. మన మనుగడలో మలుపులుకూడా అలాగే తలపుల్లో నిలచిపోయాయి. కానీ — మరింకే గతాన్నీ చోటుచేసుకోనీయకుండా ఆ దిక్కుల అంచులకి నడచిపోదాం. ఆకాశం...నేలా...అందంగా కలిసిపోయే ఆ సుదూర తీరానికి వెళ్లిపోయి — ఒకరి కళ్లతో మరి ఒకరం చూసుకుందాం ... ఒకరి పెదాలతో మరి ఒకరం పలుకరించుకొందాం...''—

''బావా''... సూర్యం ఒడిలో ఒదిగిపోయింది యామిని...

తనివితీరా ఆమెను తన హృదయానికి హత్తు కుని తలమీద ముద్దు పెట్టుకున్నాడు సూర్యం...

'నౌబత్ పహాడ్' మీది నూతనాలయంలోని గంటలు మోగుతూంటే— ఆ శబ్ద తరంగాలు చలువరాతి చల్లదనంలో కరిగిపోయాయి !!

(అయిపోయింది)

### అంకితం

నా రచనావ్యాసంగంలో నాకు అన్నివిధాలా సహకరించే అర్ధాంగి రాజ్యలక్ష్మి — స్నేహ పాత్రులు శ్రీమతి రతన్ ప్రసాద్, శ్రీయుతులు ఎమ్మెస్సార్ మూర్తి, ఏవియన్ మూర్తిగార్లకు కృతజ్ఞతలు తెలుపుకుంటూ— భద్రగిరి శ్రీరామచంద్రునికి భక్తిప్రపత్తు లతో ఈ రచనను సమర్పించుకుంటున్నాను.

— రచయిత

## జయసుధకు ముసలి మొగుడు

మొన్న డిశంబరు 17కు, జయసుధకు పదిహేడు నిండి, 18 ఆమె 47 దాటిన ముసలి వ్యక్తిని భర్తగా ఎన్నుకుంది ఈ విచిత్ర వివాహం జరిగిన వుదంతాన్ని, నిర్మాత క్రాంతికుమార్ వెల్లడించారు

నిజంగా జరిగిందేమోనని పాఠకులు మోసపోతారేమో! మరి ఎక్కడ జరిగిందో తెలపాలిగా హైదరాబాద్‌లో జరిగింది "జ్యోతి" చిత్రంలో యీ విచిత్ర వివాహం జరిగింది

జయసుధను పెండ్లియాడిన ముసలి మొగుడు ఎవరో తెలుసా? అనేక చిత్రాలలో నాయికా నాయకులకు మామగా, తండ్రిగా నటించే గుమ్మడిగారే

## రాఘవేంద్రరావు పనితనం

"జ్యోతి"చిత్రానికి దర్శకుడు రాఘవేంద్రరావు తను నేర్చిన పాఠాన్నంతా వుపయోగపరచారు "జ్యోతి"గా జయసుధ మహోన్నతంగా నటించింది మురళీమోహన్, జయలక్ష్మి, సత్యనారాయణ, గిరిబాబు, రావుగోపాలరావు శుభ, కృష్ణకుమారి ముఖ్యపాత్రలను పోషించారు



'జ్యోతి'లో జయసుధ, మురళీమోహన్

## రాజాకు జవరాలుగా జయసుధ

మారుతీ ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "రాజా" చిత్రం షూటింగు ఏప్రిల్ నుంచి వరుసగా నాలుగు మాసాలు జరుగుతుందనేడి నిజాన్ని, "రాజా" పాత్రధారి శోభన్ చెప్పారు.

రాజాకు జవరాలుగా జయసుధ నటిస్తున్న నిజాన్ని, నిర్మాత ఎ. ఎల్. కుమార్ వెల్లడించారు.

సహాయపాత్రలను రావుగోపాలరావు, రాజబాబు, రమాప్రభ, అంజలీదేవి పోషించగలరని దర్శకుడు రాఘవేంద్రరావు తెలిపారు.

"రాజా"కు సత్యానంద్ సంభాషణలను, చక్రవర్తి సంగీతాన్ని సమకూర్చగలరు.

"హీ—మాన్" చిత్రానికి ఏస్ కెమేరామెన్ వి. ఎస్. ఆర్ స్వామి ఛాయాగ్రహణం నిర్వహించే అవకాశాన్ని మారుతీ ప్రొడక్షన్స్ అధినేత కలిగిస్తున్నట్టు తెలుస్తోంది. వెల్‌కమ్ కాంబినేషన్ యిన్‌డీడ్



# సినిమా విశేషాలు

## జయప్రదకు నిశ్చితార్థం

రవివర్మ గీచిన అపురూప సౌందర్యరాశివలె జయప్రద సాక్షాత్కరించింది ఆమెకు పెండ్లి వయస్సు వచ్చేసరికి, ఏవేవో కోర్కెలు ఉదయించాయి

ఆమె మనసులో ఒక అందాల మగరాయడు దోబూచులాడాడు ఆమెను ప్రతిక్షణం తన ప్రేమ బాణాలతో ఉక్కిరిబిక్కిరిచేస్తూ వున్నాడు కన్ను మూసిన, కన్ను తెరచినా కృష్ణ దివ్యమంగళ రూపం ఎదురేగి, రా రా అంటూ ఆహ్వానించేది

తను కోరినవాడు, మగసిరి గలవాడు అగు కృష్ణతో జయప్రదకు నిశ్చితార్థం జరిగింది ప్రేమికుల సందడి హద్దు దాటింది

ఆమె అవయవ సోయగాన్ని, కృష్ణ అభివర్ణించాడు ఏమనో తెలుసా?

"వచ్చిందీ కొత్త పెళ్లికూతురు
మనసుకు తెచ్చింది కొండంత వెలుతురు
నడయాడే వెన్నెలలా, చిరుగాలీ తెమ్మెరలా,
ఎలమావి లేచిగురులా, సొగసు విరిబోణిలా,
నిండుతరవాణిలా; వచ్చిందీ పెళ్లికూతురు."

అంటూ తన హృదయేశ్వరిని అణువణువునా ఆఘ్రాణించాడు.

ఈ రసమయ దృశ్యం ఆర్. కె. ఆర్ట్స్ వారి "మన వూరి కథ" వర్ణ చిత్రంలో అగుపిస్తుంది. ఉషారయిన పై ప్రేమ పాటను గోపీ రాశారు. ఎస్. పి. బాలసుబ్రమణ్యం మధుర మధురంగా పాడారు. జె. వి. రాఘవులు సంగీతాన్ని సమకూర్చారు.

## కృష్ణ ఉన్నత నటన

"మన వూరి కథ" చిత్రంలో రైతుబిడ్డగా కృష్ణ వున్నతమైన నటన్ను ప్రదర్శించారు. పాత్రధారులందరూ సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, గిరిబాబు, అల్లురామలింగయ్య, మాడా, జయప్రద, రోజారమణి, గిరిజారాణి, నిర్మల, రాజేశ్వరి, అర్జా జనార్దనరావు, రాజనాల ఉచితరీతిలో నటించారు.

సాహిత్య అకాడమీ అవార్డు పొందిన పద్మరాజుగారి "నల్లరేగడి" నవల "మన వూరి కథ" చిత్రానికి మాతృక. ఈ చిత్రాన్ని రంజిత్‌కుమార్ సమర్పించ, రామచంద్రరావు నిర్మించారు. కె. హేమాంబరధరరావు దర్శకుడు. "పాడిపంటలు" ఫేమ్ పుష్పాల గోపీకృష్ణ ఈ చిత్రానికి ఛాయాగ్రాహకుడు.

## కొత్త రచయిత రామ్మూర్తి పాటలు

విఖ్యాత దర్శకుడు విశ్వనాథ్‌గారు వెండి తెరకు ఒక రచయితను పరిచయం చేశారు. ఆయన పేరు వేటూరి సుందరరామమూర్తి.

ఈమధ్య ఆతని పాటలను చూశాను. సుందరాకృతి బడసివున్న నిజాన్ని కనుగొన్నాను.

సుందరరామమూర్తి రాసిన యిరవై పాటల్లో దాదాపు అన్నీ బాగా వున్నాయి అనే చెప్పాలి

"సత్యచిత్రవారి ప్రేమబంధం, గోపీకృష్ణా మూవీస్‌వారి భక్త కన్నప్ప; సావరిన్ ఎంటర్‌ప్రైజెస్‌వారి శీలానికి శిక్ష; గీతాకృష్ణా కంబైన్స్ వారి చిత్రం; శ్రీ వనజా ఎంటర్‌ప్రైజెస్‌వారి "పొరుగింటి పుల్లకూర" చిత్రాల్లో రామమూర్తి రాసిన పాటలు రమణీయంగా వున్నాయి.

ఇంతవరకు పాటల రచయితగా మాత్రమే వుంటున్న సుందరరామమూర్తిని గీతాకృష్ణా కంబైన్స్‌వారి చిత్రానికి సంభాషణల రచయితగా అంగీకరించారు,. విశ్వనాథ్ గారు.







### సీతా కళ్యాణం !

ఆనందలక్ష్మి ఆర్ట్ మూవీస్ నిర్మిస్తున్న భారీ పౌరాణిక వర్ణ చిత్రం "సీతా కళ్యాణం" శరవేగంగా తయారవుతూంది. బాపూగారి అపురూప సృష్టి "సీతా కళ్యాణం" చలనచిత్ర చరిత్రలో అనితర సాధ్యమయిన సంచలనాన్ని ఏర్పరచగలదు. లక్షలు ఖర్చుపెట్టి నిర్మిస్తున్న "సెట్లు" ఎ వన్‌గా వున్నాయి.

### సీతారాములు !

సీతగా జయప్రద పుత్తడిబొమ్మలా వుంది. రాముడుగా కొత్త నటుడు రవి, అందంగా ఉన్నాడు.

రావణబ్రహ్మగా సత్యనారాయణ రంగారావు లేని లోటును తీరుస్తున్నారు. దశరథ మహారాజుగా గుమ్మడి, కైకేయిగా జమున నటిస్తున్నారు.

జనక మహారాజుగా మిక్కిలినేని, వశిష్ఠ విశ్వామిత్రులుగా ధూళిపాళ, ముక్కామల, నారదుడుగా కాంతారావు, కౌసల్యగా హేమలత, సుమిత్రగా పి ఆర్. వరలక్ష్మి నటిస్తున్నారు.

మాటలకు ముళ్లపూడి, సంగీతానికి మహదేవన్, కళకు కుదరవల్లి, ఛాయకు కె. ఎస్. ప్రసాద్, ట్రిక్ ఫొటోగ్రఫీకి రవికాంత్ అధిపతులు ఈ చిత్రానికి పింజల ఆనందరావు నిర్మాత

### శోభన్ వాణిశ్రీల ప్రేమ విహారం

హీమాన్ అందాన్ని, అతగాడి మంచితనాన్ని అగ్రనటి ప్రేమించింది. వాణిశ్రీ సౌందర్యాన్ని, ఆమెలోని చిలిపితనాన్ని శోభన్ ప్రేమించాడు.

ఇద్దరిదీ ఒకే వుద్యోగం. అందాల అలంకరణ సామగ్రికి యిద్దరూ సేల్స్‌మెన్.

నిష్కళంకమైన వారి ప్రేమ విహారానికి దారి తీసింది. సుందరతరమయిన ఏకాంత ప్రదేశంలో యిద్దరూ ఆడసాగారు ఆనంద పారవశ్యంలో పాడసాగారు, ఏమని ?

"పువ్వులా నవ్వితే
మువ్వలా మోగితే
గువ్వలా ఒదిగితే
రవ్వలా పొదిగితే
నిన్ను నేను నవ్విస్తే
నన్ను నువ్వు కవ్విస్తే
అదే ప్రేమంటే అదే అదే"

అంటూ నవ్వుల కౌగిలిలో విహరించారు

ఈ మధురమైన శృంగారఘట్టం సత్యచిత్ర వారి "ప్రేమ బంధం" వర్ణ చిత్రంలో అగుపించి, అందరినీ ఆకర్షిస్తుంది ఈ ప్రేమ పాటను డాక్టర్ నారాయణరెడ్డి వ్రాశారు సుశీల బాలు పాడారు మహదేవన్ సంగీతాన్ని సమకూర్చారు విశ్వనాథ్‌గారి చిత్రీకరణలో "అబ్బో అబ్బో" గావచ్చింది

### విశ్వనాథ్ విశ్వరూపం

"ప్రేమబంధం" చిత్రం విశ్వనాథ్‌గారి విశ్వరూపాన్ని ప్రదర్శించింది ప్రతి షాట్‌లో విశ్వనాథ్‌గారి విశిష్టత కొట్టొచ్చినట్టు కనిపించింది పాటల చిత్రీకరణలో విశ్వనాథ్‌గారు ప్రత్యేక శ్రద్ధను చూపెట్టిన విజం వెల్లడయింది.

### పాత్ర పోషణ !

"ప్రేమబంధం" చిత్రంలో 'షావుకారు' జానకి పాత్రపోషణ అద్వితీయంగా వుందని చెపితే, సత్యనారాయణ నటన అద్భుతంగా వుందని చెప్పి తీరాలి శోభన్ వాణిశ్రీల నటన "నువ్వా నేనా" అన్నట్టుగా వుందంటే, దేవదాస్ రావు గోపాలరావుల కనిపించని దుర్మార్గం కసిగా వుందని చెప్పాలి

సత్యచిత్రా అధినేతలు సత్యనారాయణ సూర్యనారాయణగార్లకు ధనవర్షం కురిసే శక్తికి లక్ష్మి కటాక్షం అనివార్యము

'ప్రేమ బంధం' చిత్రంలో వాణిశ్రీ, శోభన్



### విశ్వనాథ్ అవునన్నవి

ప్రేక్షకులు హర్షించి, ప్రశంసించే దర్శక శ్రేష్ఠుడు విశ్వనాథ్ గారికి పరిశ్రమలో వున్న డిమాండ్ అనితరసాధ్యమైనది

ఆయన కావాలి అని వచ్చే వాళ్ళందరికీ 'అవునంటె' యిరవై చిత్రాలు లిస్టులో వుంటాయి కాని విశ్వనాథ్‌గారికి అత్యాశలేదు గాబట్టి కొందరినే తృప్తిపరుస్తున్నారు.

విశ్వనాథ్‌గారి "అవునన్నవి" ఏవో పాఠకులకు తెలియాలిగా డి వి ఎస్ రాజాగారికి, గీతా కంబైన్స్‌కు, యువచిత్ర మురారికి అంగీకరించారు మరో ముగ్గురికి చెయ్యడానికి అభ్యంతరం చెప్పలేదని తెలిసింది

"ప్రేమబంధం మాంగల్యానికి మరోముడి" చిత్రాలు విశ్వనాథ్‌గారి 'స్టార్‌డమ్' ను మరింత పెంచే కథావస్తువును, జనరంజకమయిన అంశాలను పొంది వున్నాయి

### ప్రేమ్‌జీ కోరిక

ఉత్తమ చిత్రాల నిర్మాతగా వుత్తర హిందూస్తానంలో 'ప్రేమ్‌జీ' కి పేరు వున్నది ఉత్తమ చిత్రాల దర్శకుడుగా విశ్వనాథ్‌గారికి యావద్భారతంలో పేరు వున్నది

ఒక వుత్తమ చిత్ర నిర్మాత, ఒక వుత్తమ దర్శకుడ్ని అడిగితే, కాదనడం సాధ్యమా? అందుకే నేమో ప్రేమ్‌జీ హిందీలో తంపెట్టిన "ఓ సీత కథ" చిత్రానికి విశ్వనాథ్ అంగీకరించారు

తెలుగు దర్శకుడి వాడిని, వేడిని, భారత ప్రేక్షకులకు చవిచూపించే బాధ్యతను 'ప్రేమ్‌జీ' స్వీకరించడం ముదావహం

ఒక మంచి నిర్మాతకు, మంచి చిత్రాన్ని రూపొందించే బాధ్యతను స్వీకరించిన విశ్వనాథ్‌గారిని అభినందించడం మన కనీస ధర్మం.

'భక్త కన్నప్ప'లో ఒక దృశ్యం

# సినిమా

### అనంతలక్ష్మిలో రామకృష్ణ, ప్రభ

అనంతలక్ష్మి కంబైన్స్ పతాకం క్రింద రామకృష్ణ, ప్రభ నాయకా, నాయికలుగా "తంతాలవు పిల్లలు" అనే చిత్రాన్ని నిర్మించారు దర్శకుడు భాస్కరరావుగారు. లక్ష్మీదీపక్ దర్శకత్వం వహించిన యీ చిత్రం అన్నపూర్ణా ద్వారా ఫిబ్రవరిలో విడుదలౌతుంది.

ఏప్రిల్ నుంచి భాస్కరరావుగారు ప్రారంభించే క్రొత్త చిత్రంలో కూడా రామకృష్ణ, ప్రభ ప్రధాన పాత్రలను పోషిస్తారు. కథాన్వేషణ జరుగుతూంది. త్వరలో తారల ఎంపిక, దర్శకుని ఎన్నిక జరుగుతుంది.

### అశ్వనీదత్ కొత్త చిత్రం

"ఎదురులేని మనిషి" వర్ణచిత్రాన్ని నిర్మించి, ప్రేక్షకాదరణతోబాటు ధనార్జనచేసిన వైజయంతీ మూవీస్ అధినేత అశ్వనీదత్ "నటరత్న" చేసిన మేలును మరువలేరు. నందమూరి ఆశీర్వాద బలంతో ముందడుగువేసిన అశ్వనీదత్, తన తరువాతి చిత్రాన్ని హైదరాబాద్ రామకృష్ణాస్టూడియోస్‌లో చెయ్యబూనడం ముదావహం.

ప్రేక్షకులకు ఏది కావాలో తెలుసుకున్న అశ్వనీదత్, వారి అభిరుచులకు అనుగుణంగా వుండే కథను, "నటరత్న" గారికి విశిష్టమయిన వేషం వుండే కథను ఎన్నుకున్నారు.

వసూళ్ల దర్శకుడు బాపయ్య వైజయంతీ మూవీస్‌వారి వర్ణ చిత్రానికి దర్శకత్వం వహించగలరని, టెక్నికల్ యూనిట్‌లో మార్పు వుండదని విజేత అశ్వనీదత్ వివరించారు.

### అల్లుడొచ్చాడు

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన "అల్లుడొచ్చాడు" చిత్రాన్ని మదరాసులో కొందరు చూశారు. ఆ కొందరిలో విమర్శకులు, పంపిణీదారులు, సాహిత్యకోవిదులు, వెండితెర అతిరథులు వున్నారు.

చిత్రం ఆద్యంతం విసుగులేకుండా, విమాన వేగంతో పరుగెత్తిన విజాన్ని అందరూ అంగీకరించారు. ప్రత్యగాత్మగారి దర్శకత్వంలో ప్రత్యేకత వున్న నిజాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు. చలపతి రావుగారి సంగీతం శ్రోతలను ఆకర్షించిన నిజాన్ని, ప్రేక్షకులు వూపిన తలలు నిరూపించాయి.

### జయసుధకు మొదటిమార్కు

వినోదభరితమయిన "అల్లుడొచ్చాడు" చిత్రంలో బరువయిన కథావస్తువు చక్కగా యిమిడ్చారు, ప్రత్యేక ఆత్మ. నటీనటు లందరూ ఉత్తమంగా చేశారన్నది నిజమే అయినా, మొదటి మార్కు మాత్రం జయసుధకు యివ్వక తప్పదు. హీరోగా రామకృష్ణ చాలా యాక్టివ్‌గా నటించారు. నాగభూషణం, రాజబాబు, అల్లురామలింగయ్య పోటీపడి నటించారు. ప్రభ గ్లామర్ పాత్రలకు సరిపోగలదని ఋజువైంది. కృష్ణకుమారి, జాస్తి బాగానే చేశారు.

"అల్లుడొచ్చాడు" చిత్రానికి జయమాలిని 'తమలపాకు' నృత్యం ప్రత్యేక ఆకర్షణ కాగలదు. ఈ చిత్రానికి సెల్వరాజ్ ఛాయాగ్రహణం యస్సెట్‌గా నిలిచింది. గణేశ్‌పాత్రో మాటలు సారస్యంగా వున్నాయి.

మంచిమనిషి అనుమోలు వెంకటసుబ్బారావు గారు నిర్మించిన యీ 14 వ చిత్రం, అందరికీ నచ్చుతుంది. నవయుగ విడుదల.

### రెండు చిత్రాల పథకం

"నటసామ్రాట్"తో ఒక వర్ణ చిత్రాన్ని, చిన్న తారలతో "అత్తవారిల్లు" చిత్రాన్ని నిర్మించే ఉద్దేశ్యం పి. ఏ. పి. అధినేతకు వుంది.

అక్కినేనిగారి చిత్రం జూన్...జులై...ఆగస్టు మాసాల్లో అన్నపూర్ణా స్టుడియోస్‌లో జరుగగలదని, ఆ చిత్రానికి తాతినేని రామారావు దర్శకులని, ఎ. వి. సుబ్బారావు చెప్పారు.

"అత్తవారిల్లు" చిత్రానికి ప్రత్యగాత్మ దర్శకుడు.

★...'పెళ్లాడే బొమ్మ'లో భారతి, రంగనాథ్...★...★...★...★...★...★...★...★...★...★...★...★...★...'అల్లుడొచ్చాడు'లో ప్రభ, రాజబాబు...★

**శారద యిల్లు పూజామందిరం**

రెండు మాసాల పై బిలుకు నుంచి "ఊర్వశి" యిల్లు పూజామందిరంగా రూపం దిద్దు కుంటూ వుంది "రాధాకృష్ణుల వివాహం, లక్ష్మీ సహస్ర నామార్చనం, సుందరకాండ పారాయణం" తోబాటు పేదలకు అన్నదానం, బ్రాహ్మణులకు వస్త్రదానం జరుగుతూ వుంది

రోజూ ముత్తయిదువులు శారద యింట జరిగే పూజలకువచ్చి, ఆమెను దీవించి, చందన ఫల పుష్ప తాంబూలాన్ని గ్రహించి వెడుతున్నారు



'పొరుగింటి పుల్లకూర'లో ...

**అన్నదమ్ములుగా శోభన్ ...**

రాజేశ్వరి చిత్రవారి ... చిత్రం షూటింగు ఏప్రిల్ ఒకట్నుంచి ... అన్నపూర్ణా స్టూడియోస్‌లో వరుసగా ... రోజులు జరుగగలదని, నిర్మాత ఎస్ ఎస్ గోపీనాథ్ చెప్పారు

"మహాత్ముడు" చిత్రంలో అన్నగా 'నటశేఖర' సత్యనారాయణ, తమ్ముడుగ "నటసామ్రాట్" నాగేశ్వరరావు నటిస్తున్నారు

అక్కినేని నటించిన ఎన్నో వుత్తమ పాత్రలను తలదన్నే వుదాత్తమైన పాత్ర "మహాత్ముడు" ఈ చిత్రంలో శారద, ప్రభ, కాంతారావు, అల్లు రామలింగయ్య, మాడా, గిరిబాబు, జి వరలక్ష్మి, కె కె శర్మ, త్యాగరాజు, మధు, జయమాలిని ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు

మాటలను ఆచార్య ఆత్రేయ, సంగీతానికి చలపతిరావు, ఛాయాగ్రహణానికి సెల్వరాజ్, కళకు జి వి సుబ్బారావు, సహాయ దర్శకత్వానికి రోషి రాజు, నిర్మాణ నిర్వహణకు అక్కినేని వెంకటరత్నం ఆధిపత్యం వహిస్తున్నారు కథ, సినిమా అనువాదం దర్శకత్వము గోపీనాథ్ నిర్వహిస్తున్నారు

**అమానుష్‌లో కృష్ణ శారద**

హిందీలో అఖండ విజయాన్ని సాధించిన "అమానుష్" చిత్రాన్ని తెలుగులో నిర్మించే బాధ్యతను, సత్యారాజు (ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్) స్వీకరించారు.

దర్శకత్వంలో అనుభవం వున్న శోభనాద్రి రామచంద్రరావు "అమానుష్" చిత్ర దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

ఉత్తమకుమార్ పాత్రను కృష్ణ, షర్మిలా పాత్రను శారద నటించగలరని తెలిసింది.

హీరో కృష్ణ నటజీవితంలో మధురానుభూతిని కలిగించే పాత్ర "అమానుష్" కథా వాయ కుడిది. ఈ చిత్రానికి సంత్యానంద్ సంభాషణలకు, పుష్పాల గోపాలకృష్ణ ఛాయాగ్రహణానికి, కోటగిరి గోపాలరావు కూర్పుకు అధిపతులు.

ఆంధ్రప్రదేశ్‌లోని అందమైన ప్రదేశాలలో వర్ణచిత్రం షూటింగు జరుగుతుంది.

**కరుణ చిత్ర పాటలు**

పాట పల్లవి: నీపై మోజు వున్నదిరా! అదరక, బెదరక చెంతకురా! రచన: కొసరాజు; పాడినవారు: బాలసుబ్రమణ్యం, సుశీల. చిత్రీకరణ రాజబాబు, శరత్‌బాబు, చంద్రమోహన్ లతో సందర్భం ప్రభను ప్రేమించారు రాజబాబు, శరత్, చంద్రమోహన్‌లు ప్రేమించిన ప్రభను వూహించుకుంటూ పై ముగ్గురు పై పాటను పాడారు

పాట పల్లవి డై, డై, అల్లరిబుల్లోడా! రచన గోపీ, పాడినవారు బాలసుబ్రమణ్యం చిత్రీకరణ సత్యనారాయణలో సన్నివేశం సత్యనారాయణ బ్రహ్మచారి అతనికి అనుకోకుండా ఒక పసిబాలుడు దొరుకుతాడు ఆ చంటివాడి ఏడుపు భరించలేక పై పాటను పాడ్తాడు

పాట పల్లవి సొగసులో కమ్మదనం, వయసులో వెచ్చదనం రచన గోపీ, పాడినవారు ఆనంద్, సుశీల చిత్రీకరించిన సన్నివేశం ప్రేమించుకున్న శరత్, ప్రభ పాడుకునే వలపు గీతం

పాట పల్లవి చీకట్లో గుసగుసలు పాతరకం, పగలే పకపకలు క్రొత్తరకం రచన డా సి నారాయణ రెడ్డి, పాడినవారు బాలు, సుశీల చిత్రీకరణ, చంద్రమోహన్, జయమాలినిలతో సన్నివేశం వయసులో వున్నవాళ్ళు ప్రేమపిచ్చిలో పడినపుడు కలిగే అనుభూతులు

పాట పల్లవి "రాజా! రావా! ఆ పల్నాటి మాంచాలిని నేనేలే" రచన దాశరథి, పాడినవారు ఎల్ ఆర్ ఈశ్వరి చిత్రీకరణ రాజబాబు, రమాప్రభలతో సన్నివేశం రాజబాబును వలచిన రమాప్రభ అతన్ని వేధిస్తూ పాడే పాట



పాట పల్లవి: రాక, రాక వచ్చినోడా! చిత్రీకరణ: జయమాలినితో.

ఈ పాటలన్నింటికీ టి. శంకర్ సంగీతం సమకూర్చారు. రమాప్రభ సమర్పించు కరుణ చిత్ర వారి "వింతయిల్లు — సంతగోల" చిత్రంలో ఈ పాటలన్నీ చోటుచేసుకున్నాయి. పి. లక్ష్మీదీపక్ దర్శకత్వంలో తయారైన యీ చిత్రం ఫిబ్రవరిలో తారకరామా ద్వారా విడుదల.

కమలాకరరావు, ఆనంద్‌లు నిర్మాతలైన యీ చిత్రానికి దయానంద్ నిర్వహణ, వెంకన్నబాబు నిర్మాణ నిర్వాహణ, అప్పలాచార్య మాటల రచన, దేవరాజ్ ఛాయాగ్రహణం,

— శ్రీనివాస్

# హేమంత తుషారం - శ్యామల

మధురిమ! ఎంత చక్కని పేరు!

మ...ధు రి...మ ... ఒక్కొ అక్షరాన్నీ మననం చేసుకుంటూ పేరులోని మాధుర్యాన్ని ఆస్వాదిస్తున్నాడు రమణ.



ఎదురింటి వరండాలో స్తంభాన్నానుకొని కూర్చుని ఉన్నదా అమ్మాయి. ఇరవై ఏళ్ళ లోపే ఉంటుంది వయస్సు— కొబ్బరిచెట్ల మధ్యనించి అగుపిస్తున్న చందమామను చూస్తోంది, అరగంటనించి.

తన గది కిటికీవద్ద నిలబడి ఈ అర గంటా ఆమెనే చూస్తున్నాడు రమణ.

''మధురిమా!'' ఎవరో పిల్చారు లోపలి నుండి.

"ఊఁ..." అన్నదేకాని ఉన్నచోటునుండి కదలలేదు ఆమె.

మధురిమ! ఎంత చక్కని పేరు!— అను కున్నాడు రమణ.

ఎవరో ఆమె? ఎంత అందంగా ఉంది!

తల్లి భోజనానికి రమ్మని పిలవటంతో కిటికీ వదలి వెళ్లాడు. అన్యమనస్కంగానే భోజనం గావించి తిరిగి ఎదురింటివైపు చూశాడు. ఆ అమ్మాయి అలాగే స్తంభానికి చేరబడి అరమోడ్పు కన్నులతో ఆకాశాన్ని చూస్తున్నది. ముఖంలో దరహాసం లేదు. ఏదో డల్‌గా, భారంగా, తీవ్రాలోచనలో ఉన్న ట్లుగా కనిపిస్తున్నది.

"అత్తా! అన్నానికి రావూ?" అంటూ వచ్చారు చిన్న పిల్లలిద్దరు. వాళ్లు రమణకు బాగా తెలుసు, ఎదురింటి ప్రసాద్ పిల్లలు.

మధురిమ సమాధానమే ఇవ్వలేదు. కాస్సే పటికి ప్రసాద్ భార్య పద్మ వచ్చి ప్రక్కనే కూర్చొని ఏదో మాట్లాడసాగింది. మధురిమ అలాగే చూపు మరల్చకుండా, ముఖంలో ఏ భావమూ ప్రతిబింబించకుండా కూర్చొని ఉన్నది.పదినిముషాలయినాక అరమోడ్పు కన్ను లను బరువుగావిత్తి,చుట్టూ ఓమారు కలియ జూసి, మెల్లగా లేచి పద్మ వెనకే లోనికి నడిచింది. ఆ నడకలో ఉత్సాహం లేదు, చలాకీదనం లేదు. ఏదో తప్పనిసరి అయినట్లు నడచివెళ్తున్న ఆమె శరీరసోయగాన్ని చూస్తుంటే మతిపోయినట్లే ఉన్నది రమణకి. ఆమె జుట్టు పొట్టిగాఉన్నా ఒత్తుగా, నల్లగా నొక్కులు తిరిగి ఉన్నది. లేతపసుపురంగు బ్లౌజుకి, అదేరంగు చీరకి మధ్యన నాలుగు వేళ్ళ వెడల్పున మెరుస్తున్న శరీరం బంగారు వన్నెలో దుస్తుల రంగుతో పోటీపడుతున్నది. పాదాలకున్న అందెలు చిరు శబ్దం చేస్తుంటే మెల్లిగా అడుగులు వేస్తూ లోనికి వెళ్ళి పోయింది మధురిమ.

* * *

"రమణా! ప్రసాద్ చెల్లెలు నిన్న ఊరి నించి వచ్చిందిట. చూశావా?" వంటింటి గడప మీద కూర్చున్న రమణకి కాఫీగ్లాసు అందిస్తూ అడిగింది తల్లి రాధమ్మ.

వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లవగా, ముఖంలోని ఆత్రుత దాచుకొనే ప్రయత్నంలో తలదించుకొని కాఫీలోనికి చూస్తూ "లేదే!" అన్నాడు-సాధ్యమయినంత సహజంగా.

"ప్రొద్దుటే పద్మవచ్చింది కాఫీపొడికోసం. ఆ యింట్లో కాఫీ ఎవరికీ అలవాటు లేదుగా! ఆ అమ్మాయికి నిద్రలేస్తూనే కాఫీ తాగందే తలనెప్పి వస్తుందిట!"

"నాలాగే..."

నవ్వింది రాధమ్మ. "నిన్ను ఓసారి వాళ్ళ యింటికి రమ్మన్నది పద్మ. ఏవో పుస్తకాలు కొన్నదిట, నీవు చూడాలంది."

ప్రైవేటుగా మెట్రిక్ పరీక్షకి కడుతున్నది పద్మ. ఆమెకి 'కోచింగ్' ఇస్తున్నాడు రమణ.

స్నానంచేసి, మంచి దుస్తులుధరించి, ఒక టికి రెండుమార్లు తల దువ్వికాని ఇల్లు దాటలేదు ప్రసాద్.

ప్రసాద్‌తో కబుర్లుచెప్పి, పద్మ పుస్త కాలు చూసి, పిల్లల్ని పలకరించి ఎంతసేపు ఆ యింట తారట్లాడినా మధురిమ అగుపడ లేదు. చివరికి అడిగేశాడు:

"మీ చెల్లెలెవరో ఊరినించి వచ్చారన్నదే అమ్మ..." అర్థోక్తిలో నిలిపివేశాడు.

ప్రసాద్ అప్పుడు చెప్పాడు మధురిమ కథని.

మధురిమ అతనికి పిన్ని కూతురు. ఆమె తల్లిదండ్రులు ఆస్తిపరులు. ఒక్కగానొక్క కూతురు. అతి గారాబంగా పెరిగింది. అనుకో కుండా గుండెపోటుతో తండ్రి మరణించగా, ఆ వెంటనే మంచ మెక్కినతల్లి మరో ఏడాది కల్లా భర్తను చేరుకుంది. కూతుర్ని కని పెట్టుకొని ఉండమని అక్కకొడుకు ప్రసాద్‌ని కోరి, అతను అలాగే మాట యిచ్చాక నిశ్చిం తగా కన్నుమూసిందావిడ.దస్తావేజులు,పత్రాలు అన్నీతిరగేసిచూస్తే,ఆస్తితో సమానంగా అప్పు ఉన్నవిషయం బయటపడింది.ఋణభారం తీరే సరికి స్వగ్రామంలోని ఇల్లుతప్ప మరేమీ మిగల లేదు మధురిమకి. నెలకొక వందరూపాయలు వచ్చేటట్లు ఆ యింటిని అద్దెకి యిచ్చి ఆమెని తనవెంట తీసుకువచ్చాడు ప్రసాద్.

హైదరాబాదులో మధురిమ కాన్వెంట్ స్కూల్‌లో చదివింది స్కూల్ ఫైనల్ దాకా. బి. ఏ. చదువుతూండగా ఈ అవాంతరాలన్నీ వచ్చాయి. ఈ పల్లెటూర్లో ఈ యింట్లో...ఈ వాతావరణంలో ఎలా ఉండగలుగుతుందో ఏమో..." దిగులుగా అన్నాడు ప్రసాద్ "మా పిన్ని నాపైన పెద్ద

## ★★★ అబల-సబల ★★★

అమ్మాయి వస్తోంది—
అందంగానే వున్నట్లుంది.
అయినా — అందమెందుకు ?
ఆడదయితే చాలు.

చెయ్యి పట్టుకుని లాగనా—
కన్నుకొట్టి కవ్వించనా—
వలపు బాణం విసరనా—
పాట పాడి పలకరించనా—?

ఆడదేగా — దానిమొహం.
అబలేగా — దాని పేరు
అందుకుంటానంటే
అందకుండా పోదులే—!

అనుకుంటూ మనస్సులో,
అటువేపు వేశా నడుగు—
అయినాను అమ్మాయికి చేరువ—
అందుకున్నాను — అబల చేయి.

చేతి కందలేదా చేయి—
చేరుకుంది చెంపను — అబ్బా!

పగులగొట్టింది గూబను—
రాలగొట్టింది పళ్లను!

ముప్పదిరెండింట మూడు రాలితే—
మిగిలిన పళ్ళు నోటిలో—
రాలిన పళ్ళు చేతిలో—
బుగ్గ మీద ఎరుపుతో

తిరిగాను వెనుకకి
కదిలాను వెనక్కి
పోననుకున్నాను జోలికి
మరొకటనుకున్నాను మనస్సులో—

అమ్మాయి వెళుతోంది—
అందంగా ఉందో లేదో ?
అయినా అందమెందుకు ?
ఆదిశక్తి అయినాక.

ఆడదంటే — అమ్మబాబోయ్ !
'సబల' — దాని పేరు
అందుకుందామనుకుంటే
పళ్ళు రాలగొడుతుంది !

— కావలిపాటి కమలరాజు

## హేమంత తుషారం

బాధ్యతే ఉంచింది ఈ రత్నాన్ని నా చేతిలో పెట్టి!''

''నాకయితే మధురిమ ప్రైవేట్‌గా చదివి ఆ బి ఎ పూర్తిచేయటం మంచిదనిపిస్తున్నది'' అంది పద్మ

''ఆవిడ చదువుకోవాలంటే చేతనయిన సాయం నేను చేస్తాను— కోచింగ్ వగైరా'' అన్నాడు రమణ

''థాంక్స్, రమణా! తన మనస్సులో ఏమున్నదీ తెలుసుకోవాలికదా ముందు. పద్మా, మధుని పిలు'' అన్నాడు ప్రసాద్.

''ప్రొద్దుటే 'వాక్' కని చెరువువైపు వెళ్ళింది, ఇంకా రాలేదు'' అంది పద్మ

''రావోయ్, రమణా, మనమూ అలా వెళ్ళి వద్దాం'' అన్నాడు ప్రసాద్ చెప్పులు వేసుకుంటూ

ప్రసాద్‌తో కలిసి రమణ లోపలి గది ప్రక్కగా నడిచి వెళ్తుంటే ఆగది కిటికీలో గాజు గ్లాసులో వికసించిన ఎర్ర మందారాలు, వాటికి చుట్టూ పేర్చిన పచ్చటి ఆకులు కనిపించాయి రమణకి అది మధురిమ చర్య అనుకున్నాడు. రమణ ఆమె టేస్ట్‌కి ముగ్ధుడయినాడు

ప్రసాద్ యింటి వెనుక పెద్ద పెరడు ఉంది అది దాటి అర ఫర్లాంగు వెళ్తే చెరువు వస్తుంది నీరెండలో మెరుస్తున్న నీటిపైన అక్కడక్కడా కలువపూలు తేలుతూ ఎంతో శోభాయమానంగా ఉన్నాయి మర్రి చెట్టుక్రింద ఓ రాయి మీద కూర్చొని ఉన్నది మధురిమ గులాబిరంగు దుస్తులు ధరించి, విశాల నేత్రాలతో ఏవో అగుపించని దూరాల్లోకి చూస్తున్న ఆమెని చూస్తుంటే, ఆకాశంలో విహరించే గంధర్వకన్యశాపవశాత్తూ ఇక్కడకు వచ్చిందేమో ననిపించింది రమణకి బాగా దగ్గరకు వచ్చేదాకా వీళ్ళను గమనించనే లేదు ఆమె గమనించినాక, పూర్తిగా వికసించని గులాబీరేకు లాంటి పెదిమలు విడీ విడకుండా చిన్నగా—అతి సన్నగా మందహాసం చేసిందే తప్ప, కూర్చున్నచోటునించి లేవలేదు,

''మధూ, ఇతడు నాస్నేహితుడు రమణ మన ఎదురిల్లే వీళ్ళది'' అన్నాడు ప్రసాద్ ''మధురిమ—నా చెల్లెలు''

చేతులు కలపకుండానే ''నమస్తే'' అన్నది

# హేమంత తుషారం

మధురిమ అతి మెల్లిగా, ఎంతో మృదువుగా.

ప్రతి నమస్కారం చేశాడు రమణ "మా యింటికిరండి ఒకసారి. మా అమ్మగారిని పరిచయం చేస్తాను."

తలూపింది—నిరాసక్తిగానే

"మీర్ని అమ్మగారిని నీవు తప్పక కలుసుకోవాలి మధూ! ఆవిడ ఓల్డ్ లైఫ్ గ్రాడ్యుయేట్. ఎన్ని పుస్తకాలు చదివారో, ఎంత విజ్ఞానం ఆర్జించారో చెప్పలేను! ప్రతి మాటలో తెలివితేటలు, సంస్కారం ఉట్టిపడుతూంటాయి" అన్నాడు ప్రసాద్

మొహమాటానికి సరే నంటున్నాను అన్నట్లుగా ఉన్నదామె చూపు

కొంత తడవు అంతా మౌనంగా గడిపారు

"ఇంక వెళ్దాం రమణా. ఆఫీసు టైమవుతున్నది నువ్వూ వస్తావామ్మా?"

"ఇక్కడ ప్రశాంతంగా ఉన్నదన్నయ్యా కాస్సేపుండి వస్తాను" మొదటిసారిగా నోరు విప్పి నాలుగు అక్షరాలు మాట్లాడింది

ఆమెలోని నిజమైన ఆకర్షణ ఆ సుకుమారమైన శరీరంకాదు .నల్లనికళ్ళు కూడా కాదు ..సంగీత మాధురి నింపుకున్న ఆ స్వరం! ఎంత మృదువుగా, ఎంత తియ్యగా ఉన్నది ఆ గొంతు! కోయిలపాట, వీణానాదం గుర్తుకు వస్తున్నాయి మధురిమ—ఎంత తియ్యనిపేరు! ఎంత చక్కగా సరిపోయింది ఈమెకు!—మళ్ళీ మళ్ళీ అనుకున్నాడు రమణ

* * *

మరో వారం రోజులకు మధురిమ రమణ వద్ద చదువుకొని ప్రైవేట్‌గా బి ఎ. పరీక్షలకు కట్టే ఏర్పాటు చేయబడింది సాయంకాలం ఆరుగంటల నించి ఎనిమిది వరకు రమణ యింట్లో చదువుకోవాలని అనుకున్నారు. ఆమె చదువుకి రమణ యింటికి వచ్చిన మొదటి రోజునే స్పష్టంగా చెప్పింది అతనితో— "నాకు చదువంటే శ్రద్ధలేదు! హాస్టల్ లైఫ్, కాలేజీ లైఫ్ చాలా సరదాగా ఉండటంవలన అప్పుడు చదువుకునేదాన్ని ఇప్పుడు ఎడతెగక ముసిరే ఆలోచనల నించి తప్పించుకోవాలనే కోరికతో మొదలు పెడుతున్నానేకాని, చదువంటే ఆసక్తి, డిగ్రీ పట్ల వ్యామోహం వుండి కాదు!"

ఆమె మాటల్లోని నిర్మొహమాటానికి ఆశ్చర్యపోయినా, మనోభావాలను సూటిగా, నిర్భయంగాచెప్తున్న ఆమెను మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు రమణ.

"డిగ్రీ వుండటం ఎప్పటికైనా మంచిదే కదండీ! ఉద్యోగార్హతను కలిగించి, మీ కాళ్ళపైన మీరు నిలబడగలిగే శక్తి నిస్తుంది."

నవ్వింది మధురిమ "నన్ను అంచనా వేసింది ఇంతేనా" అన్నట్టున్నది ఆ నవ్వు. తను అన్న మాటల్లో అనకూడనిది ఏ ముందో అర్థంకాలేదతనికి.

"ఉద్యోగం చేయాలని, నాతిండి నేను సంపాదించుకోవాలని నేననుకోవటం లేదే! నేను కావాలనుకుంటే నా సంరక్షణ భారం మీద వేసుకొని నన్ను ఆరాధించే వ్యక్తి దొరకడా— నాకు తగినవాడని నేను ఆమోదించగలగాలే కాని!?"




ఆమె అహంభావానికి రమణకి కలిగిన విస్మయం అంతా యింతా కాదు

అతడు పాఠాలు బోధపరుస్తున్నప్పుడు ఆమె వింటున్నదో, లేదో తెలిసేదికాదు ఎటో చూస్తూ కూర్చునేది మధ్యలో ఏదైనా ప్రశ్నవేస్తే, తెలిస్తే జవాబు చెప్పేది, లేదా నవ్వేసి ఊరుకొనేది— 'ఏమిటీ ప్రశ్నలు, జవాబులు ? సిల్లీ ! ఈ ట్యూషన్ ఇంత సీరియస్‌గా తీసుకోకండి !' అన్నట్లుండేది ఆ నవ్వు అతను మాత్రం పాఠాలు చెప్తూనే ఉన్నాడు ఆమె ప్రతి కదలిక ఎంతో కళాత్మకంగా, ఆమె తూచి తూచి మాట్లాడే ప్రతిమాటా ఒక మంజులగానంవలె లనిపించేది అతనికి.

ప్రసాద్‌కాని, రమణకాని ఆశించినట్లు మధురిమకీ, రాధమ్మకి స్నేహం కలవలేదు రమణకి రాదమ్మ తల్లి మాత్రమేకాదు, ఆప్త మిత్రురాలుకూడా రాధమ్మ తండ్రి తహశీల్దారు బాల్యవివాహాలు సర్వసామాన్యమైన ఆరోజుల్లోనే కూతురిని కాలేజీకి పంపి బి ఎ. చదివించాడు తాను చూసిన గొప్ప సంబంధాలను కాదని క్లాస్‌మేట్ రామాన్ని ఆమె పెళ్ళి చేసుకుంటానన్నపుడు ఆయన నిరాశ చెందినా రామం గుణగణాలను అతనికి రాధపట్లకల ప్రేమను తెలుసుకున్నాక అతడితో రాధ సుఖపడుతుందనే నమ్మకంతో వాళ్ల పెళ్లి చేశాడు పెళ్ళవుతూనే ఈ గ్రామంలో అడుగుపెట్టి, శారద, రమణ— ఇద్దరు పిల్లల తల్లయి— శారదకు ఢిల్లీలో ఉన్న మిత్రుని కొడుకుతో వివాహం జరిపించి నాలుగేళ్ల క్రితం భర్త మరణిస్తే ఎది వచ్చిన కొడుకు రమణను చూసుకుంటూ కాలం గడుపుతున్నది ఆవిడ ఏడాది క్రితం ఎం ఏ. పాసయిన రమణకి సిటీలో కాలేజి లెక్చరర్ ఉద్యోగం వస్తే, అది కాదని స్వగ్రామంలో వ్యవసాయం చేసుకుంటూ గడపటం అతనికి హాయనిపించింది. సిటీలో వుండి అద్దె ఇళ్లల్లో నివసిస్తూ దినమంత ఉద్యోగానికే వెచ్చించటం కంటె, పుట్టి పెరిగిన యింట్లో నివసిస్తూ— తన పొలాలు తానే పండించుకుంటూ— తీరికసమయాల్లో తనకు యిష్టమైన పుస్తకాలు చదువుకుంటూ, రాసుకుంటూ— ఇంకా వీలయితే అడిగినవారికి హాబీగా చదువుచెప్తూ— పొలంగట్లవెంబడి మైళ్ల పొడవునా షికార్లకి వెళ్తూ— ఈ జీవితంలోని సింప్లిసిటీ,

# మీ బిడ్డకు 3 నెలలు నిండాయా?

3 నెలలు నిండిన మీ బిడ్డలను
కేవలం పాలతోటే సరిపెట్టేయకండి;
వాళ్ళకి బలమైన రక్తం కోసం,
ఐరన్‌తో నిండిన శక్తినిచ్చే (ఘన)
ఆహారం అవసరం—అని
డాక్టర్లు అంటున్నారు:



**ఫారెక్స్‌ను ఇవ్వండి.
ఇది ఐరన్‌తో నిండినదే
కాక, శక్తినిచ్చే (ఘన)
ఆహారం కూడా!**

ఒక్క ఫారెక్స్ మాత్రమే
మీ బిడ్డ పెరుగుదలను బట్టి,
అవసరమైన ఆహార పదార్థాలను
బిడ్డకు అందివ్వడంలో మీకు
తోడ్పడుతుంది.

పెరుగుతూన్న మీ బిడ్డకి ఫారెక్స్
ఏమేమి యిస్తుందో చూడండి:

- రోగ నిరోధక రక్తం, శక్తి కోసం పోషకపు ఐరన్.
- పళ్ళు, ఎముకలు బలంగా ఉండటానికి కావలసిన కాల్షియం మరియు విటమిన్-డి.
- బాగా పెరిగేందుకు ఇట్టే జీర్ణమయే ప్రోటీన్.
- ఆ వయసుకు ఆయుర్దాయం, అందుకు కావలసిన బలం.

మీ బిడ్డ పెరుగుదలతో పాటు ఫారెక్స్ ఎంత ఇవ్వాలో తెలుసా:

| బిడ్డ వయస్సు | ఎంత ఫారెక్స్ ఇవ్వాలి |
|---|---|
| 3—6 నెలలు | 1—2 చిన్న చెమ్చాల నిండుగా రోజుకు రెండు సార్లు |
| 6—9 నెలలు | 3—4 చిన్న చెమ్చాల నిండుగా రోజుకు మూడు సార్లు |
| 9 నెలలు—3 సంవత్సరాలు | 4—6 చిన్న చెమ్చాల నిండుగా రోజుకు నాలుగు సార్లు |

CMGF-46 234 TEL




# ఫారెక్స్

3 నెలలు దాటినప్పటినుంచి సంపూర్ణమైన పెరుగుదలకు
మీ బిడ్డయొక్క మొట్టమొదటి ఘన ఆహారం

*ఉచితం: ఫారెక్స్ గురించిన పుస్తకం ఉచితంగా పొందడానికి 25 పై. తపాలా బిళ్ళలతో పాటు మీ పేరు, చిరునామాలను ఈ చిరునామాకు (ఏ భాషలో కావాలో తెలియచేస్తూ) పంపించండి: డిపార్ట్‌మెంట్ A, పోస్ట్ బాక్స్ 16668, బొంబాయి 400 026.*

**గ్లాక్సో**

సంతృప్తి, సిటీలో మరికాస్త డబ్బు ఎక్కువ సంపాదించినా— ఆ ఉద్యోగంలో లేదనిపించిం దతనికి. అతనిముందు అతని తండ్రి చేసిందీ అదే! మామగారు గవర్నమెంటు ఆఫీసులో మంచి ఉద్యోగం వేయిస్తే, అది కాదని తను పల్లెటూర్లో నివాస మేర్పరచుకున్నాడు. ఆ పద్ధతే నచ్చింది రమణకి కూడా. అతడి తల్లీ దీనికే ప్రోత్సాహమిచ్చింది. ఎప్పటికప్పుడు తన అభిప్రాయాలు తల్లికి చెప్పటము, ఆమె తో ఆసక్తికరమయిన విషయాలపై వాగ్వివాదాలు పెట్టుకోవటము, చివరకు ఇద్దరి ఉద్దేశాలు పలు విషయాల్లో ఒకటే కావటము— వారికి అలవాటు. అటువంటిది మధురిమ పట్ల తామిద్దరికి పూర్తిగా వ్యతిరేకమయిన అభిప్రాయాలు కలగటం అతనికి ఏమీ బాగా లేదు.

"ఆ అమ్మాయికి తనపట్ల తనకి చాలా ప్రేమ! అంత ప్రేమ కలిగిన వాళ్లు ఇతరులని సుఖపెట్టలేరు" అన్నది రాధమ్మ, ఒక నాడు రమణ మధురిమ గురించి మెచ్చుకోలుగా మాట్లాడినపుడు.

"ఆమెని ఎవరయినా పెళ్లి చేసుకుంటే ఆమెని సుఖపెట్టాలన్న ఆలోచనలోను, సుఖ పెట్టటంలోను తన సుఖాన్ని చూసుకుంటాడే కాని 'ఆమె నన్ను ఏం సుఖపెడ్తున్నది' అని ప్రశ్నించుకోలేడమ్మా!" అన్నాడు రమణ.

"నీవెన్నైనా చెప్పు రమణా! మధురిమకి జీవితంలో ఉన్నత విలువలున్నాయని నేనను కోను!"

"అమ్మా!" అతని స్వరం వేడుకోలుకి, ఆజ్ఞాపనకి మధ్యలో ఉన్నట్లున్నది "మనం మధురిమ గురించి మాట్లాడక పోవటం మంచిదేమో! అనవసర విషయాలపై వాగ్వివాదాలు దేనికి?"

రాధమ్మ మరి ఆ టాపిక్ ఎత్తలేదు.

నాలుగు రోజుల తర్వాత ప్రసాద్ వచ్చి— "ఇవ్వాళ మధు పుట్టినరోజు. వాళ్ళ యింట్లో ఉన్నవాళ్ళు గ్రాండ్‌గా చేసుకొనేది ఈ పండగ! ఇక్కడ తనకి తెలిసినవాళ్ళు మీరు మాత్రమే. కనక నీవు, మీ అమ్మగారు సాయంత్రం మా యింటికి రావాలి" అని పిలిచాడు.

చిన్న పిల్లల సరదాలలో ఉత్సాహం ఉండే వయసు దాటిన రాధమ్మ రాలేనని సున్నితంగా చెప్పింది. రమణ పొలం గట్ల వెంబడి దొరికే రకరకాల పూలతో అందమైన 'బుకే' కట్టి తీసుకు వెళ్లాడు.

## హేమంత తుషారం

హాల్లోనే కూర్చొని ఉన్నారు అంతా — మధురిమ, పద్మ, ప్రసాద్, పిల్లలు అంతా మంచి దుస్తులు ధరించి నీటుగా తయారయి ఉన్నారు.

మధురిమకి చేతిలోని పూల గుత్తి నందిస్తూ శుభాకాంక్షలు చెప్పాడు రమణ.

"థాంక్స్" అంది మృదువుగా.

పద్మ కాఫీ, ఫలహారాలు యిచ్చింది.

"మేమంతా గుడికి వెళ్తున్నాము. మీరూ రారాదూ?" అని పిలిచింది రమణని.

ఊరికి మరో చివరనున్నదా దేవాలయం. రెండు మైళ్ళు నడిచి దైవదర్శనం చేసుకొనేసరికి రాత్రయింది. తెలిసిన వారెవరో కనిపిస్తే వాళ్ళతో కబుర్లలో పడ్డారు పద్మ, ప్రసాద్. పిల్లలు మరి కొంతమందితో కలిసి దొంగాట ఆడసాగారు. వెన్నెలలో ఆ ప్రదేశ



మంతా ఆహ్లాదకరంగా ఉన్నది. గుడి ఆవరణ లోని మెట్లమీద వచ్చి కూర్చుంది మధురిమ. ఎదురుగా కూర్చున్నాడు రమణ.

పాలరాతి బొమ్మలాగా, వెన్నెల్లో తడిసిన ముద్దబంతి పూవులాగా ఉన్న మధురిమ ఎప్పటివలెనె మౌనంగా ఉన్నది.

హఠాత్తుగా అడిగింది మధురిమ: "ఎం. ఏ. వరకు చదువుకొని మీరు ఈ పల్లెటూర్లో ఎందుకు ఉంటున్నారు?"

"నాకు మరొకరి క్రింది ఉద్యోగం చేయటం అట్టే ఇష్టంలేదు మధురిమా! పైగా నాకు స్వంత పొలం ఉంది."

పెదవి విరిచింది మధురిమ. "ఏమో! నాకు సిటీ లైఫే ఇష్టం! స్నేహితులతో కలిసి సినిమాలు, హోటళ్లు, పిక్నిక్‌లు— ఇవన్నీ నా అలవాట్లు! నలుగురితో తిరగటం, దర్జాగా 'లగ్జరీ'లో జీవించటం, అందరూ రాణిలాగా చూస్తుంటే మురిసిపోవటం... ఇలా గడిచింది మా అమ్మా, నాన్నా పోయే వరకు...ఇప్పుడు..." గొంతులో కాస్త తడి కదిలింది— "నిన్నటివలె నేడు, నేటివలె రేపు... ఉహుఁ, మార్పేలేదు రొటీన్‌లో. ఈ పేదరికం, ఈ పల్లెటూరి ప్రశాంతత... ఒక్కొసారి ఈ విసుగుదలతో, ఈ 'బోర్'గా ఉన్న జీవితం గడపలేక పిచ్చెక్కుతుందేమో ననిపిస్తుంది."

మధురిమ తనతో ఎన్నడూ ఇంత మాట్లాడిందిలేదు. రమణలో ఏవేవో భావనలు, ఏవేవో అనుభూతులు.

"మధూ! నీవు పెళ్ళిచేసుకోవాలి ... అప్పటికిగాని ఈ 'బోర్‌డమ్' తగ్గదు..."

సన్నగా నవ్వింది మధురిమ. "అన్నయ్యా అదే అన్నాడు. మొన్ననొక సంబంధం గురించి చెప్పాడు కూడా. ఏదో కంపెనీలో సేల్స్ మన్‌ట. 'మంచిజీతమే—బాగానే ఉంటాడు' అన్నాడు. నేను వద్దన్నాను."

"ఎందుకని?" ఉత్సుకతతో ప్రశ్నించాడు రమణ.

కాస్సేపు నిశ్శబ్దంగా ఉండి తర్వాత అన్నది "ఎందుకో సేల్స్‌మన్ జాబ్‌లో దర్జా లేదనిపించింది!"...

రమణకి షాక్‌తిన్నట్లయింది.

"మధూ!" మృదువుగా అన్నాడు "పెళ్లి చేసుకొనే వ్యక్తి నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తే చాలదా? ఉద్యోగం, డిగ్నిటీ, డబ్బు ఇవన్నీ ఆనందానికి నిజంగా కావాలంటావా?"

"ఆనందమనేది పూర్తిగా వ్యక్తిపరమైనది మాష్టారూ! నాకు ఆనందాన్ని చ్చేది మీకు ఇవ్వలేకపోవచ్చు. అలాగే మీకు సంతోషం కలిగించేది నన్ను సంతోష పెట్టలేకపోవచ్చు" క్లుప్తంగా సమాధానమిచ్చింది మధురిమ.

ప్రసాద్, పద్మ అటుగా రావటంతో సంభాషణ ఆపివేశారు. ఇంటికి వెళ్లే త్రోవలో అన్నాడు ప్రసాద్ చెల్లెలితో: "ఇందాక నేను మాట్లాడాను చూడు, ఆయన కొడుకు ఏలూరులో— బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు. ఇప్పుడు గుమాస్తాయేకాని బ్యాంక్ పరీక్షలు అవీ రాసి ముందు ముందు పైకి పోగలడు. ఏమంటావు, మధూ, నీకు ఇష్టమయితే వాళ్లతో నీ గురించి మాట్లాడదామని ఉంది. నీకు ఇష్టమయితేనే సుమా!"

తలవంచుకొని నడుస్తున్న మధురిమ నింపాదిగా కళ్లెత్తి అన్నగారిని చూసింది. ''ఏమీ అనుకోకు అన్నయ్యా! గుమాస్తాని చేసుకోవాలని నాకులేదు. కనీసావసరాలయినా సరిగా తీర్చుకోలేని జీతంతో సుఖంగా బ్రతకలేనేమో'' సౌమ్యంగా చెప్పింది.

ఇల్లు చేరేదాకా ఇక ఆ విషయం ఎవరూ మాట్లాడలేదు.

రమణ, మధురిమల మధ్య స్నేహం పెరుగుతున్నదే కాని, రమణకి ఎందుకో చనువు పెరగటంలేదు. ఒకనాడు మధురిమ అన్నది— ''అన్నయ్య చెప్పే ప్రతి సంబంధాన్ని వద్దనవలసివస్తోంది మాష్టారూ! నాకు గర్వమనుకుంటారేమో కూడా... కాని నాకు ఉన్న ఆశలు అలాంటివి. ఇంతవరకు కోరినది పొందటం తప్ప, పరిస్థితులతో రాజీ పడి తల ఒగ్గలేదు దేనికీ. ఇప్పుడు కూడా అలాగే ఉన్నాను, అంతే! నాకు నచ్చిన సంబంధం ఎన్నటికీ దొరకదేమోననే భయం నాకు లేదు. నాలో, నా అందంలో, నా మనస్సులో, నా అదృష్టంలో నాకు విశ్వాసముంది!''




నవ్వాడు రమణ. ''నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తూ నిన్ను 'ఎడ్మైర్' చేస్తూ ఉండే ఓ వ్యక్తి నీ ఎదుటే ఉన్నాడుతెలుసా? నీవు ఎదురుగా ఉండటమే తన అదృష్టమనుకుంటున్నాడతను!'' మనసులో మాట పైకి అనేశాడు.

అర్థమైనట్లు చూసింది మధురిమ. ''మాస్టారూ! మీరంటే నాకు ఎంతో స్నేహభావముంది ... లైకింగ్ ఉంది...దాన్ని ప్రేమ అనమంటారా ?''

## హేమంత తుషారం

రమణ జవాబు చెప్పలేదు. సమ్మోహితుడై ఆమెనిచూస్తూ, ఆమె తియ్యని మాటలు వింటూ ఉండిపోయాడు.

''కాని ప్రేమ పర్యవసానం పెళ్ళిఅయితే, పెళ్ళి అనేది సంతోషం కోసం అయితే, మనం ఆ బంధంలోకి దిగరాదండీ !''

''ఎందుకు మధూ ? నీఆశలు, కోరికలు నేను తీర్చలేనని సందేహమా ?''

సమాధానం చెప్పలేదు మధురిమ. 'నీకూ తెలుసుకదా' అన్నట్లు చూసింది.

''మధూ! వివాహ జీవితంలో ఆనందానికి ముఖ్యంగా కావలసింది ప్రేమ. చిన్నతనం కొద్దీ నీవది గ్రహించటంలేదు. నీవు నాకు కావాలి డియర్ !''

టేబుల్‌కి ఇరువైపులా కూర్చొని ఉన్నారు వాళ్ళు. హఠాత్తుగా, మధురిమ ఊహించని విధంగా ఆమె చేతిని తనచేతుల్లోకి తీసుకొని గట్టిగా నొక్కాడు.

ఆమెచేయి విడిపించుకోలేదు 'తప్పకదూ' అన్నట్లు మందలింపుగా చూసింది.

''నన్ను ఆలోచించుకోనివ్వండి'' అంది చిన్నగా.

ఆమె చేతిని విడవకుండానే, ''నీ ఇష్టమున్నంత కాలం ఆలోచించుకో మధూ! కాని...కాని చివరకు మన పెళ్ళికి 'అవును' అనాలి'' అన్నాడు.

'నాకూ అవుననే అనాలని ఉంది' అన్నట్లుగా చూసి పుస్తకాలు సర్దుకొని వెళ్లిపోయింది మధురిమ.

* * *

'ఒళ్ళు ఝల్లుమంటుందిర ఓ గోరి చిన్నోడా!'

సాయంత్రం తన చేతిపైన రమణ స్పర్శ గుర్తు వచ్చినప్పుడల్లా, ఏనాడో విన్న పాట మదిలో మెదులుతోంది. నిద్ర పట్టక దొర్లుతున్న మధురిమ ఆ స్పర్శ ఇంకా తన చేతిపైనే ఉన్నట్లే అనిపించగా, నవ్వుకొని మంచంమీద లేచి కూర్చుంది. మంచం ప్రక్కనే ఉన్న కిటికీలోంచి పడుతున్న వెన్నెలతో గదంతా నిండివుంది.

'రమణకి ఏం తక్కువ?' అడిగింది ఆమె మనసు. అతనికి మంచి రూపం ఉంది. చదువు ఉంది. సంస్కారం ఉంది. అన్నిటికీ మించి తనపట్ల ప్రేమ ఉంది.

''రమణా! నీ వంటే నా కిష్టం. కాని నీకెంతో ఇష్టమయిన పల్లెటూరి జీవితం నాకయిష్టం!! నీకు ప్రియమైన సింప్లిసిటీ అంటే నాకేమీ ఆపేక్షలేదు!!!'' అంది ఎదురుగాలేని రమణతో.

'ఎం. ఏ. ఫస్ట్ క్లాసులో పాసయినాడు కదా, ఏ ఐ. ఏ. ఎస్. కోలేక బ్యాంక్ ఆఫీసర్ల పరీక్షలకో వెళ్లకూడదూ? ప్రయత్నిస్తే 'సిటీ'లో మంచి ఉద్యోగమే దొరకదా? ఇన్ని పుస్తకాలు చదువుతాడు— ఇంత లోకజ్ఞానం ఉంది— ఏ కాంపిటేటీవ్ పరీక్షకు వెళ్లినా సెలక్ట్ అవుతాడే— ప్రయత్నమే చేయడు! ఆంబిషనే లేదు!

కాని నేను పెళ్లిచేసుకుంటే, నాపైన ఇంత ప్రేమ కలవాడు— నాకోసం నేను అడిగినది చేస్తాడు! నేను నచ్చజెప్పి ఒప్పించ గలను!'

అలా అనుకొనేసరికి మధురిమ మనసుని హాయి ఆవరించింది. ఏ నిశ్చయానికి గట్టిగా రాకముందే నిద్రాదేవి ఆమెని తన ఒడిలోకి తీసుకుంది.

* * *

వారంరోజులు మామూలుగానే గడిచాయి. మధురిమకి రోజూ పాఠాలు చెప్తూనే ఉన్నాడు రమణ.

రోజూ రాత్రి తొమ్మిది గంటలవరకు మధురిమతో హస్కుకొట్టి, చెల్లెలిని తీసుకు వెళ్లటానికి వచ్చే ప్రసాద్‌తో మరింతసేపు కబుర్లు చెప్పి, వాళ్ళు వెళ్లాక తన గదిలో నించి భోజనానికి ఇవతలకు వచ్చే రమణ ఎందుకో తల్లి వద్దకు వచ్చేసరికి ఏదో గిల్టీగా ఫీలవసాగాడు.

కాళ్ళు చేతులు కడుక్కొని వంటగది లోనికి వచ్చాడు రమణ. తల్లి ఏదో పుస్తకం చదువుకుంటూ కనిపించింది గదిలో కుర్చీలో కూర్చొని.

''అమ్మా, భోజనం చేద్దామా ?''

పిలిచాడు.

''వస్తున్నా'' పుస్తకం మూసి లేచి వచ్చింది. అన్నం తింటూ తింటూ అకస్మాత్తుగా తల ఎత్తి చూసిన రమణ తల్లి ముఖం దిగులుగా ఉండటం గమనించాడు.

''అమ్మా!''

తల ఎత్తిందావిడ. కళ్లల్లో నీళ్ళు కదుల్తున్నాయి.

''ఎందుకమ్మా, అలా వున్నావు?''

“ఎలాగున్నాను? ఏమీలేదు!” నవ్విందావిడ.

“నాకు తెలుసు! నేను మధురిమతో స్నేహంగా ఉండటం నీకు ఇష్టంలేదు కదూ? అమ్మా, నేను నిన్ను బాధ పెడ్తున్నాను కదూ?” సూటిగా అడిగాడు.

“అమ్మా, నీవు, నాన్నగారు ప్రేమించి పెళ్లిచేసుకున్నారు. మీరు సుఖంగా ఉండలేదా? నేను మధురిమని ప్రేమించి పెళ్లి చేసుకుంటే సుఖపడనని ఎందుకనుకుంటున్నావు? నాకు పాతికేళ్లు వస్తున్నాయి. నా మంచిచెడులు తెలుసుకోలేనా? అనవసరంగా బాధపడుతున్నావు నీవు!”

''నాన్నా, రమణా, ఓ మాట చెప్తున్నా విను. జీవితాన్నించి నీవు కోరుతున్నవి, మధురిమ ఆశిస్తున్నవి పూర్తిగా వ్యతిరేకమయినవి. సర్దుకుపోయే స్వభావం ఇద్దరికీ లేదు. నీకూ తెలుసు ఆ సంగతి—'' అన్నదామె జవాబుగా.

తల్లిమాటలకు అడ్డు వచ్చాడు రమణ ''మాయిద్దరిమధ్య వివాహసంబంధం ఏర్పడినప్పుడు—ఒకరిపైన ఒకరికి ఎనలేని ప్రేమ ఉన్నప్పుడు — తనని నేను మార్చలేనంటావా అమ్మా ?''

''రమణా ! ఏం చూసి మధురిమను ప్రేమిస్తున్నానంటున్నావు ? మీ యిద్దరి మనస్తత్వాలు, దృక్పథాలు, ఆలోచనలు, కోరికలు, ఆశయాలు ... అన్నీ వేర్వేరు ! యవ్వనంలోని యువతీ యువకుల మధ్య కలిగే ఆకర్షణ యిది ... ప్రేమ కాదు ! పూలమీద, ఆకులమీద తెల్లవారుజామున కనబడే మంచుబిందువులను ఎప్పుడైనా చూశావా ? లేత సూర్యకిరణం ఒకటి పైన పడగానే మాయమవుతాయి. నీవు చెప్తున్న ప్రేమా అలాంటిదే ! పెళ్లి అయినాక కలిసి జీవించటం మొదలయేసరికి ఆకర్షణ వెలుగు ఆరిపోతుంది. నీ యీ ప్రేమ హేమంత తుషారం వంటిది !'' యిక చెప్పవలసినదేమీ లేదన్నట్లు ఆవిడ లేచి తన గదిలోకి వెళ్లిపోయింది.

కోపం, బాధ పెనవేసుకురాగా అలాగే కూర్చుండిపోయాడు రమణ.

* * *

ఒక సాయంత్రం పొలాల ప్రక్కగా నడచి వస్తూ, ఆకసాన తేలిపోతున్న మబ్బులను చూస్తూ, మధురిమ గురించి కలలు కంటున్న రమణకి, దూరంగా మామిడి చెట్టుక్రింద నిలబడివున్న మధురిమ కనిపించింది. ఆశ్చర్యంగా చూస్తూ, నడక వేగాన్ని పెంచి ఆమె వద్దకు వెళ్లాడు. మామిడి చిగురు రంగు చీర, అదే రంగు బ్లౌజు, ఆ రంగులోనే కుంకుమబొట్టు, మెడలో సన్నని ముత్యాల దండ. రమణను చూసి దగ్గరకు వచ్చింది.

''ఇంట్లో ఏమీ తోచక ఇలా వచ్చాను...'' నవ్వింది...'తోచకపోవట మేమిటి — పాఠాలు చదువుకోరాదా' అంటారేమో మాస్టారు! ?''

''ఉహూఁ, అనను, నీవు రాకపోతే ఈ సాయంత్రం ఇంత అందంగా ఉండేదికాదు !''

అతని ప్రశంసని వినసట్లే ఉండిపోయింది

మధురిమ. ఇద్దరూ గడ్డిలో కూర్చున్నారు.

"మధూ! నే నడిగినదానికి నీవింతవరకూ సమాధానం ఇవ్వలేదు!" తెచ్చిపెట్టుకున్న నిష్ఠూరంతో అన్నాడు.

.. ........ .. .

"నన్ను ప్రేమిస్తున్నావా — ప్రేమించ గలవా — అని అడిగాను. మర్చిపోయావా ?" కాస్త కోపంగా అన్నాడు.

"ఊఁ" వొంపులు తిరుగుతున్న తీయని స్వరం.

వ్యక్తులపేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరుపైన లేదా కార్డుపైన ఉదాహరిస్తూ సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ — 520003 అన్న చిరునామాకి పంపండి. —సం.

## హేమంత తుషారం

"ఊఁ ఏమిటి ? మనం పెళ్ళి చేసుకుందా మని కూడా అన్నాను."

"మాస్టారూ!" బరువైన కనురెప్పలు క్రిందికి వాలుస్తూ అంది "నేను చాలా ప్రాక్టికల్ మనిషిని" అంది.

"మధూ! ఎంత సినికల్‌గా మాట్లాడుతున్నావు?" తల్లి భావాలనే ఈమె వేరే మాటలలో చెప్తోంది.

"కాని నిజం చెప్తున్నా, మాస్టారూ, నాకు మీరంటే ఎంతో . ఎంతోయిష్టం... కాని..."

ఆ మాటలు వింటుంటే, చల్లగాలి శరీరాన్ని స్పృశించినట్లు, మనస్సు మబ్బుల్లో తేలిపోతున్నట్లు అవగా, తనకి తెలియకుండానే ఆమె నడుంచుట్టూ చేయివేసి, దగ్గరకు తీసుకొని, పెదిమలపై— చల్లని మంచు లాంటి ఆ పెదిమలపై, కాలిపోతున్నట్లున్న తన పెదిమల నుంచి... ... ఐతె ఆమెను ఎంత దగ్గరకు తీసుకున్నా ఇంకా దూరం మిగిలిపోతున్న ఆమె మూర్తి. ....

"మాష్టారూ, ఏమిటిది?" అన్న మాటలతో మత్తు విడినట్లయింది రమణకు

"మధూ! నీవు నాకు కావాలి"

"మాష్టారూ, నేను ఇంకా ఏ నిర్ణయానికీ రాకముందే ఇంత చనువు తీసుకోవటం. ." రోషంతో శరీరం కంపిస్తున్నది ఆమెకు.

"క్షమించు మధూ!" మనస్ఫూర్తిగా అన్నాడు.

"నేను వస్తాను" అంటూ ఆమె వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

* * *

మధురిమ ట్యూషన్‌కి రావటం మాని వేసింది.

కొద్దిరోజులకే ప్రసాద్ మిత్రుడి తమ్ముడొకతను అమెరికానించి శలవమీద ఆవూరు రావటం, ప్రసాద్ ఎవరితోను చెప్పకుండా అతన్ని యింటికి తీసుకువచ్చి మధురిమను చూపించటం, అతను ఆమెని పెళ్ళిచేసుకోవటానికి యిష్టపడటం—అన్నీ జరిగిపోయాయి. అన్నగారు ఈ సంగతి చెప్పేసరికి మధురిమ మనసులో భావాలు సముద్ర కెరటాలలాగా ఉద్వేగంతో ఎగిరిపడసాగాయి. తను కోరుకున్నటువంటి సంబంధం... డబ్బు, హోదా, చదువు, భోగభాగ్యాలు, అమెరికా నివాసం—కాదనేందుకు ఏమీలేదు. కట్న కానుకలేమీ వద్దట! తానే అన్నిటికీ మించినదట! ప్రసాద్ మాటలు గుర్తువచ్చి సిగ్గుతో ముఖం అరుణిమ దాల్చింది.

"రమణ! అతని సంగతేమిటి" అంది మనసు.

... త్వరలో జరగబోయే పెళ్ళి ... తన అదృష్టం... ఈ ఆలోచనలు రమణని ఆమె మనసునించి పూర్తిగా బయటకు పంపివేశాయి క్షణాల మీద.

* * *

ఏడాది తర్వాత పెళ్ళిపీటలపైన ఉన్న రమణ, ప్రక్కనే నిండుగా, తృప్తిగా కూర్చొనిఉన్న మేనమామ కూతురు లలితను చూస్తుంటే ఎవరో మరెవరినో 'మధూ!' అని పిలవటం వినిపించి చటుక్కున

మధురిమ గుర్తొచ్చింది ఆమె నల్లనికళ్లలో మెదుల్తూండే అసంతృప్తికి, లలిత కళ్లలోని తృప్తికి ఎంతతేడా! మధురిమ రూపాన్ని గుర్తుతెచ్చుకోవటానికి ప్రయత్నించాడు రమణ కాని అతని స్మృతిపథంలోని ఆమె రూపం పూర్తిగా మసకబారిపోయింది ఎంత ప్రయత్నించినా గుర్తుకిరాలేదు తల్లి — తనపైన లలితపైన అక్షింతలు జల్లుతూ చిరునవ్వుతో దీవిస్తున్న తల్లి — ఒకప్పుడు అన్నమాటలు: "మీ యిద్దరిమధ్యా నున్న ఆకర్షణ హేమంత తుషారం వంటిది. కాస్త వేడిమి తగలగానే మాయమవుతుంది—" మనసులో మళ్ళీ వినిపించి తనలో తనే నవ్వుకున్నాడు బావ నవ్వుకి కారణం తెలియక ఆశ్చర్యంగా చూసింది లలిత!

ఎస్ ఎన్ డి ?రాపురం

నా వయస్సు 19 సం లు నేను చిన్నతనంలో ఎత్తైన ప్రదేశము నుండి బండరాయిపై పడగా ముక్కుకు గాయమైనది ముక్కు క్రిందభాగం ఒక ప్రక్కగాపోయి వికృతంగా తయారైనది ముక్కు రంధ్రాలు ఒకవైపు చిన్నవిగను, ఒకవైపు

## డాక్టర్ సలహాలు

పెద్దగాను, వుంటుంది దీనిని శస్త్ర చికిత్స ద్వారా గాని, మరే విధంగానైనా బాగు చేయవచ్చునా

ఇలా ఎత్తైన ప్రదేశం నుంచి పడటం ద్వారా ముక్కుకి దెబ్బతగిలి తద్వారా ముక్కు వంకర పోవటం, సహజమే ' దీనిని ఇ ఎన్ టి వైద్యులు, ప్లాస్టిక్ సర్జరీ నిపుణులు శస్త్ర చికిత్స ద్వారా బాగు చేస్తారు మరే విధమైన అవకాశంలేదు

జి బి ఆర్ విశాఖపట్నం

నాకు 25 సం లు 17 సం లప్పుడు పైపై

ఎుడోవచ్చింది. అప్పుడు చెవుల్లో దిమ్ముగా వుండేది. కొన్ని రోజులు పోయాక కుడి చెవిలో నీరు కారటం ప్రారంభించింది. డ్రాప్సు వాడాను. ఒక స్పెషలిస్టు ఆపరేషన్ చెయ్యాలన్నారు. అది మద్రాసులోచెయ్యాలన్నారు. ఒకచెవి సరిగా వినపడదు. నాకు తీసిబాధగా వున్నది.

ఏదైనా రోగ ప్రభావంవల్ల చెవులు వినబడక పోవడం జరిగితే ఆ రోగ లక్షణాలు వాటివల్ల రోగికి కలిగే బాధ మొదలయిన వాటిననుసరించి ఇ. ఎన్. టి. వైద్యులు రోగనివారణ క్రమాన్ని నిర్ణయిస్తారు. వీరి సలహా పాటించటం తప్పఏదో పక్కవారు భయపెట్టారని మీరు నిర్ణయం తీసుకోలేక పోవటం మంచిదికాదు ధైర్యంగా ఆపరేషన్ చేయించుకోవటం మీకు అన్ని విధాలా శ్రేయస్కరం.

ఎస్. కె. డి. వి. పి. పొన్నమండ

నా వయస్సు 48 సం. లు. నేను ఒక ప్రభుత్వ ఆస్పత్రిలో "డ్యూడినల్ అల్సర్"కు ఆపరేషన్ చేయించుకున్నాను. ఆపరేషన్ అయిన తరువాత 5 నెలలు బాగానే వున్నది. కాని తర్వాత డోకులు వెళ్ళుచున్నవి. డోకు వెళ్ళిన తర్వాత కొంత సుఖముగా వుంటుంది. నాకు ఇదివరకున్న లక్షణాలలో మార్పు లేదు.

పెప్టిక్ అల్సర్ అనే "కడుపులో పుండు" ఉన్నవారికి శస్త్ర చికిత్స చేసిన తర్వాత, తిరిగి యథాప్రకారం, రోగలక్షణాలు ఏర్పడటం పలువురిలో జరుగుతున్నది! ఇది ఎవరి లోపం కాదు! 'కడుపు' అనే "స్టమక్"లో ఎక్కువ ఆమ్లం ఉత్పత్తి అవటంవల్ల ఆపరేషన్ చేసిన ప్రక్క భాగంలో తిరిగి "పుండు" (అల్సర్)ఏర్పడటం మాత్రమే మీరు వ్రాసిన పై లక్షణాలకికారణం! కారం, పులుపు ఆహారంలో మానటం, ఆహారం నియమ బద్ధంగా తీసుకోవటం, 'ఆర్బిట్స్" మాత్రలు రోజుకి 6 (2 వంతున మూడు పూటలు) నమిలి మింగాలి. (ఆహారానికి 20 ని. లు ముందుగా)

వి. వి. ఆర్. పూళ్ళ

మా పాపవయస్సు ఎనిమిది మాసములు. పుట్టినపుడు బాగానే వున్నది. ఒక నెల తరువాత తల పై భాగాన కణితిలాగ నిమ్మకాయ సైజులో బయలుదేరినది. దానికి ఏమి చెయ్యాలో తెల్పండి.

తల పై భాగాన అని వ్రాస్తే మాత్రం సరి పోదు. "ఎక్కడ, ఎటువంటి"మొదలయినవాటిని గురించి పూర్తి వివరాలు వ్రాయాలి. ఆ 'కణితి' గట్టిగా ఉన్నదీ, లేక మెత్తగా వున్నదీ, అదిపెరుగుతున్నదీ లేనిదీ వ్రాస్తే జవాబు వ్రాయటం తేలిక!

నా వూహ ప్రకారం ఇది 'డెర్మాయిడ్ సిస్ట్" (చర్మంలోనుంచి ఉత్పత్తి అయిన కణితి) మాత్రమే అయి ఉంటుంది. దీనికి ప్రస్తుతం ఏమీ చేయు నక్కరలేదు. పై విషయాలను గమనించి వ్రాస్తే తగిన సలహా చెప్పగలను.

డా. కె. వెంకటేశ్వరరావు

## హైదరాబాద్ నోట్ బుక్

**వచనకవి కుందుర్తి ఘనవిజయం**

మిత్రులు శ్రీ కుందుర్తి ఆంజనేయులు ఏ శుభముహూర్తాన వచన కవితా ప్రస్థానానికి వెలుగుబాటలు తీర్చారోగాని, ప్రబంధ పద్ధతినే నమ్ముకున్న హేమాహేమీలు వచన కవితను చేపట్టి కుంభస్థలే విజయానికి కారణం వుతున్నారు. రిపబ్లిక్ దినోత్సవంనాడు నవ్యసాహితీ సమితి యాజమాన్యాన రాష్ట్రప్రభుత్వ సహకారంతో రవీంద్ర భారతిలో జరిగిన కవి సమ్మేళనంలో వచనకవితా రీతి ఎంత ప్రజాదరణ సాధనమో, పాత్రమో నిరూపితమైంది సమ్మేళనంలో పాల్గొన్నఇరవై మంది కవులలో గడియారం రామకృష్ణశర్మ, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి మరొకరు తప్పలం దరూ వచనకవితే చదివారు. సుబ్బన్న శతావధాని, ముదిగొండ వీరభద్రమూర్తివంటివారూ ఛందో బందోబస్తును వదలి వచన కవితకు దిగారంటే వో వచన కవితామతల్లీ నీకు జేజేలు.

**తారామణుల త్యాగబుద్ధి :**

రంగస్థలనటులు, సినిమాతారలు మొదటినుంచి సంఘ శ్రేయస్సుకు సేవ చేస్తూనే ఉన్నారు కరువు కాటకాలు కాటేసినప్పుడు, తుఫానులు, వరదలు ముంచెత్తినప్పుడు నటబృందం తమ ప్రదర్శనలతో సేకరించిన లక్షలాది మొత్తాన్ని విరాళమివ్వడం ఇంత వరకు ఎన్నోసార్లు జరిగింది కాని, జనవరి 26న రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా 22 మంది సినిమాతారలతో విఖ్యాత సినిమా నటీమణి శ్రీమతి జమునా రమణారావు సంగీత నాటక అకాడెమీ యాజమాన్యాన నిజాం కళాశాల ఆవరణలో సమర్పించిన సాంస్కృతిక కార్యక్రమం అపూర్వం,అనిదంపూర్వం అని ఎవ్వరైనా చెప్పగలరు. 20 వేల మంది ప్రేక్షకులు సుఖాసీనులై చూడగల రంగస్థలాన్ని నగరంలో నిర్మించడానికి ఈ ప్రయత్నం జరిగింది. దీనికి30 లక్షలు వ్యయమవుతాయి. ఈ ప్రదర్శనం ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన ముఖ్య మంత్రి తమ ప్రసంగంలో ఈ ప్రదర్శనవల్ల దాదాపు ఎనిమిది లక్షలు వచ్చాయని, ప్రభుత్వం 23 లక్షలు ఇస్తుందని, అవసరమైతే మరికొంత కూడా మంజూరు చేస్తుందని అన్నారు. ప్రతిజిల్లా ప్రధాన పట్టణంలోను ఒక ఆధునిక నాటక రంగస్థలం నెలకొల్పబడుతుందన్నారు. ముఖ్యఅతిథి గవర్నర్ శ్రీ సుఖాడియా చలనచిత్రాభివృద్ధి కార్పొరేషన్ తొట్టతొలుత ప్రారంభించిన రంగస్థల నిర్మాణ కార్యక్రమం ఇదేనని ఆర్థిక మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి అన్నారు. శ్రీమతులు జమున, ఛాయాదేవి, కాంచన, ఎస్. వరలక్ష్మి, జి. వరలక్ష్మి, సూర్యకాంతం, మొదలైన ప్రముఖ నటీమణులు ఈనృత్య నాటక ప్రదర్శనంలో పాల్గొన్నారు. శ్రీమతిజమున సత్యభామ అలం.సూర్యకాంతం ఛాయాదేవుల భార్యాభర్తలు, జి వరలక్ష్మి, మహానటి రూపాదేవి, అమ్మాయి నీళ్లుపోసుకుంది,భాంగ్రా నృత్యం గిరిజ, రమాప్రభల పాల్గొన్న పెండ్లి చూపులు ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించాయి నిజాంకళాశాల మైదానం జనంతో కిటకిటలాడింది ఈ ప్రదర్శనం ఏర్పాట్లకు అహర్నిశం పరిశ్రమించిన మిత్రులు సంగీత నాటక కళా అకాడెమీ సంయుక్త కార్యదర్శి శ్రీ కృష్ణంరాజును, శ్రీ గోవిందచౌదరిని, వారి సహచరులను అభినందిస్తున్నాను.

**నలుగురు ప్రముఖులకు సన్మానం :**

జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఫిబ్రవరి 2వ తేదీన రెండవ స్నాతకోత్సవ సందర్భంలో ఒక మంచిపని చేసింది నలుగురు ప్రముఖులు డాక్టర్ కె ఎల్ రావు, ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తిబోర్డు అధ్యక్షులు శ్రీ నార్ల తాతారావు, పెట్రోలు, సహజవాయు కమిషన్ అధ్యక్షుడు శ్రీ మాతక్కి భాను ప్రసాద్, ప్రముఖ ఛాయా చిత్రగ్రాహకులు, రాష్ట్ర ప్రభుత్వం ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్. భగవాన్‌దాస్‌లను సన్మానించడం. గవర్నర్ శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా ఈ నలుగురికి గౌరవ డాక్టరేట్ బిరుదాన్ని అందజేశారు. వైస్ ఛాన్సలర్ డాక్టర్ ఎం. వి. రాజగోపాల్‌ను, తక్కిన నిర్వాయకులను అభినందిస్తున్నాను. ఈ ఉత్సవం జూబిలీ హాలులో జరిగింది స్నాతకోపన్యాసమిచ్చిన శ్రీ భాను ప్రసాద్ సాంకేతిక జ్ఞానాన్ని ఆర్థిక కార్యక్రమానికి అన్వయించాలని హితవు చెప్పారు.

**శ్రీ వి. బి. రాజు హితవు :**

కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా నియమితులైన శ్రీ వల్లూరి బసవరాజు ఫిబ్రవరి 2వ తేదీన గాంధిభవన్‌లో తనకు జరిగిన ఘనసన్మానంలో ప్రసంగిస్తూ కాంగ్రెసు కార్యకర్తలు అధికార వాంఛకు స్వస్తిచెప్పి, కుమ్ములాటమాని, క్రమ శిక్షణతో, సేవాభావంతో, సమైక్య సాధనకు, జాతి ప్రగతికి అంకితం కావాలనిసలహా ఇవ్వడంఎంతో ఉదాత్తంగా ఉంది ఈ సభలో కేంద్ర మంత్రులు రాష్ట్ర మంత్రులు, పలువురు ప్రముఖులు ప్రసంగించడం, శ్రీ రాజు బహుజనప్రియత్వాన్ని చాటుతున్నది.

**ఉపశ్రుతి :**

“ఏమిటండీ, జనవరి 26న జరిగిన సినీతారలు, ప్రదర్శనం ప్రకటనలో అందరూ స్త్రీలే అని ఉందే. ఎందుకండీ” అని అడిగాడు మిత్రుడుమార్పు గోపీనాథం. నేను ఆలోచించుకొని, ప్రకటనకర్తల భావం వివరిద్దామనుకొనేలోగామిత్రుడు కనిపించ లేదు. అతనికే తోచపోదా ! అని ఊరుకున్నాను.

—తిరుమల రామచంద్ర



మెరిసే ఆకుపచ్చని అరిటాకూ
మధ్యగా స్ఫటికం లాగా బంగారుతీగల వరి అన్నం
నల్లగా నవనవలాడే గుత్తి వంకాయ కూర
చూస్తే తినేసే పచ్చని నల్లని గోంగూర పచ్చడీ
ఎర్రగా వర్రగా ఊరట పాకుతూన్న అవకాయా
పసుపు పచ్చని పూలకుప్పలాంటి పులిహోరా
మధ్యలో పచ్చని కర్వే పాకూ, ఎర్ర మిరపకాయలూ
కరిగిన బంగారంలాంటి పరమాన్నం
గిన్నెలో వెండి దిమ్మలాంటి పెరుగు
భోజనం ఒక రంగైన రుచి

అంతా రంగుల మయం






# నెరొలాక్

రంగు మన జీవితంలో ఒక సమగ్రమైన భాగం— నెరొలాక్

U-GNA-13

## అవీ — ఇవీ — అన్నీ

### జ్ఞాన భాస్కరోపనిషత్

శ్రీ దామిసెట్టి జయరావు బి.ఏ. బి.ఎల్. వ్రాసిన జ్ఞాన భాస్కరోపనిషత్ ప్రతి మా కార్యాలయం చేరింది. 110 పుటల యీ గ్రంథంలో రచయిత ఎన్నో శ్లోకాలను వచించి వాటికి టీకతాత్పర్యాదులేగాక విశేషాంశాలు కూడా యిచ్చారు. సంస్కృత పండితులు పలువురు యీ గ్రంథాన్ని, రచయితను ప్రశంసిస్తూ దీనిలోని తొలిపలుకులు పలికారు. వెల రు. 7.50 ప్రతులు కావలసినవారు శ్రీ జి జగన్నాధరాజు దుర్గా నర్సింగ్‌హోమ్ అమలాపురం తూ. గో. జి. వ్రాయవచ్చును.

### చిగురించిన జీవితం

శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు రచించిన "చిగురించిన జీవితం" నవల మా కార్యాలయం చేరింది. 92 పేజీల ఈ పుస్తకం వెల 4రూపాయలు. ప్రచురణ: ప్రగతి పబ్లిషింగ్ హౌస్- ఏలూరురోడ్డు, విజయవాడ—520002.

### సామాన్యుని సణుగుడు

(16వ పేజీ తరువాయి)

కళాశాలవారు ఏర్పాటుచేసిన ఎన్.ఎస్.ఎస్. క్యాంపు కెళ్ళాను ... మారుమూల గ్రామంలో విద్యార్థులు శ్రమదానం చేసి ఓ హరిజనవాడలో రోడ్డు వేశారు ... గ్రామవాసుల సూటి పోటి వేళాకోలం మాటలు లక్ష్యపెట్టకుండా చేతులు బొబ్బలెక్కేలాగ రోడ్డు త్రవ్వి — రాళ్ళు మోసి — రోడ్డు వేశారు. 16 ఏళ్ల అబ్బాయినుంచి 24 ఏళ్ల కుర్రాడిదాకా ఎంత క్రమశిక్షణ, ఎంత జాతీయ భక్తి... నిజంగా మేను పులకించింది — కళ్యాణోత్సాహంలాంటిది కలిగింది ,.. ఈ దేశం మీద యీ యువతమీద అట్లాంటి మమకారమేదో ఎదను పులకింత లిడింది. —ఏమిటీ రెండు దృశ్యాలు? ఇది వైవిధ్యమా? వైరుధ్యమా?— ఈ రెంటి మధ్యగల దూరాన్ని అంతరాన్ని కలిపే సూత్రమేది? పద్ధతేది? ఏది? ఎట్లా? కాసేపు ఆలోచించాను ... ఏం తోచక తిరుగు ప్రయాణంలో సినిమా వాల్ పోస్టర్ల వేపు దుకాణాల్లో అగుపడే మాగజైన్‌లవేపు దృష్టి మరల్చాను.

[వీరాజీ]

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar. Vijayawada-3. Editor: S. Radhakrishna**

